# ఏకాక్షి

(పరిశోధక నవల)

రెండవ భాగము.



ప్రకాశకులు:

శ్రీ కృష్ణా బుక్ డిపో,

రాజమండ్రి.

శ్రీ రాజన్ ముద్రాశాల : రాజమండ్రి.

1930

# పీ ఠి క.



మొదటిభాగము వెనువెంటనే బయలుదేరిన యీ రెండవభాగమునకు పీఠిక యనవసరమని వ్రాయుట మానుకొన్నాము.

ప్రకాశకులు,

నారాయణరావు బ్రదర్స్.

# ఏకాక్షి

పరిస్థితులు క్షణములో గ్రహించి కృష్ణుడు కార్యక్రమ
మునకు దిగినాడు. వానిపిస్తోలు మెలకువగా మీాదకు లేచినది.
ఢాం! ఏకాక్షి కెవ్వుమని కేక వేసినాడు. వాని మెద దూడకొ
ట్టవలసిన దెబ్బయది. బుగ్గకుతగిలి దూసికొని పోయినది. అత
డార్చుచు గిర్రున తిరిగినాడు.

ఢాం! తుపాకి చేతపట్టుకున్నయాతడు మొదటిదెబ్బకు
వెనుకకు తిరిగి చూచినాడు. రెండవ దెబ్బ వాని కాలులో
తగులుటచే నతడు గిర్రునతిరిగి క్రిందపడినాడు. కాని వానిచేతి
లోని తుపాకి కమానునకు చేయి తగులుటచే నది ఢాం! అని
పేలినది-గుండు కిటికీలోనుంచి పోయినది. కృష్ణుడు దెబ్బకొట్టి
కిటికీప్రక్క దాగొనినాడు కాని యాలశ్యమయినది. అప్పటి
కప్పుడే తుపాకినుండి బయలుదేరిన గుండు వాని జెబ్బలోనుం
చి దూసికొనిపోయినది. అతడు 'అబ్బా' యని యరచి, పిస్తో
లువిడచి నేలకొరిగినాడు. కాని త్వరలోనే సరుదుకొని, పిస్తోలు
తీసినాడు. వాని కొక చేయి నిరర్థకమయినను రెండవచేతితో
పిస్తోలు పుచ్చుకొని గాలిలోనికి నాలుగు బారులు పేల్చినాడు

అప్పటి కప్పుడే కంగారు బయలుదేరినది. ఇరుగు పొ
రుగు యిండ్లలోనుండి జనులు పరుగెత్తుకొని వచ్చినారు. ఒకరి
ద్దరి చేతులలో తుపాకులున్నవి. వీధికి రెండవ వైపుననున్న

స్టేషనులోని పోలీసుజవానుకూడ తొందరగా పరుగెత్తుకొని వచ్చినాడు. కాని తుపాకి మరచిపోయినాడు పాపము. చేతులూపుకొనుచు వచ్చినాడు.

లోపలనున్న యేకాక్షి పరిస్థితులు క్షణములో గ్రహించినాడు. పందెము పోయినది. అతడు వరుసగా నందున్న యందరి జేబులలోని సామాను—డబ్బు సహితము తీసుకుడిగా ప్రోగుచేసికొనవచ్చుననుకొన్నాడు.

"పారిపొండి! కిటికీలోనుంచి! అవతలపడు సోములు! మేము నిన్ను తీసికొని పోవుదుము" అని కేకవేసినాడు.

అతడప్పటి కప్పుడే తొందరగా వెనుకకు తిరిగి వాని మీదపడిన యిరువురు మానవులను రెండుదెబ్బలతో క్రిందపడ కొట్టి, కిటికీలోనుంచి దుమికి యప్పటికే యవతలకు పోయిన వాని యనుచరుని వెన్నంటి పోయినాడు. అప్పటికి చీకటిలో నక్కియున్న మానవుడొకడు యేకాక్షి నెత్తిమీద నొక సీసా విసరికొట్టినాడు. ఏకాక్షి తొందరగా పిస్తోలు పేల్చి యామానవుడు కెవ్వుమని కేకవేయుట విన్నాడు. అతడక్కడ వాని యనుచరుని కలసికొని, రెండవవైపు కిటికీ వెలుపల కృష్ణుడు పడి యున్న దిశకు పోయినాడు.

"సోములు! రా! రమ్ము!" అని యేకాక్షి కచ్చితముగా కేకవేసినాడు.

అప్పటి కప్పుడే పదిమందివచ్చి క్రిందపడి యున్నవానిని

పట్టుకున్నారు. చేతిలోనితుపాకి బలవంతముగానూడ పెరకినారు.

"నన్ను పట్టుకున్నారు! మీరు పారిపొండు" అని యతడు బిగ్గరగా కేకవేసినాడు.

ధాం! వీధిచివరనుంచి వచ్చుచున్న మరియొకరు చేతిలోని తుపాకి పేల్చినారు. గుండు 'రుయ్యి' మని వచ్చి యేకాకీ కాలు దూసికొని పోయినది. వా రిరువురప్పటికే పరుగు ప్రారంభించినారు. వచ్చినవారిలో చాలామంది వారివెంట పడినారు. ఇప్పు డందరును శూరులే! పారిపోవువారిని తరుముట కెంతకావలయును. కాని ప్రయోజనము లేకపోయినది.

ఈ లోపున కృష్ణుడు నెమ్మదిగా నరుదుకొని లేచి, తడుముకొనుచు గుమ్మము దగ్గరకు వచ్చినాడు. హాలంతయు కంగారుగా నున్నది. ఒకరికొక రడ్డు వచ్చుచున్నారు. తొందర వర్తమానము మీాద నక్కడకు వచ్చిన యాయూరు డాక్టరు హాలులో ప్రవేశించి, యప్పుడే గుమ్మము సమీపించిన కృష్ణుని చూచి "ఆహా! నీవా! అబ్బాయి? దెబ్బలు తగిలిన వాడిలో నీ వొకడవా? రా! రా! త్రోవచేయుడు!" అని కేకవేసి చేయు చాపి, కృష్ణుని యందుకొని, యాసరాయిచ్చి లోపలకు తీసికొని వచ్చినాడు.

ఈ లోపున క్రిందపడి యున్న తుంటరి చుట్టును చేరిన ప్రజలందరు వాని ముఖమున కున్న ముసు గూడబెరికినారు. వాడు తృణీకారముగా పండ్లికిలించసాగినాడు.

అచ్చటి వెలుతురు, వేడిమి, తుపాకిమందు వాసన, పొగ, కృష్ణుడు భరించచాలక పోయినాడు. మితిమీరి యున్నవి. అతడు నెమ్మదిగా కండ్లుమూసికొని ప్రక్కకు తిరిగినాడు. మూర్ఛ వచ్చినది.

అతనికి తిరిగి స్మారకము వచ్చునప్పటికి కొంతసేపు పట్టినది. అత డప్పటికి హోటలులోని యొకగదిలో మంచము మీద పండుకొని యున్నాడు. గాయము తలిగిన వానిచేతికి కట్టు కనుపించినది. ధనరాజును రామచంద్రమును వాని మంచమునకు చేరియొకప్రక్కను కూరుచున్నారు.

"ఏలాగున్నది కృష్ణా? బాధగ లేదుకదా?" అని యాత్రముగా నడిగినాడు రామచంద్రము.

"ఆ! కులాసగనే. అదిగో ధనరాజు! నిన్ను విడుదల చేసినారే అయితే! నే నా తుంటరిని పిస్తోలుతో కొట్టిన తరువాత నేమిజరిగినది? ఏకాక్షిగాడు పడిపోయినాడా నా దెబ్బతో?" అని యాత్రముగా నడిగినాడు మందస్వరమున.

"లేదు బాబూ! దెబ్బ సరిగా తగలలేదు. కాని సోములు దొరికిపోయినాడు. వాడే యా కోమటి పిల్లకాయలను దోచుకొనినది. వారి పొరపాటునకు నేను తిట్టను. సోములు సరిగా నాలాగున దుస్తులు వేసికొన్నాడు. పోలీసువారు వానిని కొట్టులో జాగ్రత్తపెట్టినారు. కోమటి పిల్లకాయలు కంగారుపడి కాళ్ళవేళ్ళ బ్రతిమాలినారు నన్ను. ఏకాక్షియును మరియొకడును పారిపోయినారు. నీ మూలమున ప్రమాదము తప్పినదని యందరును నీ పేరు చెప్పుకొని సంతోషించుచున్నారు.

కాని కొంచెము నిద్రిపొమ్మ నాయనా!" అన్నాడు ధనరాజు యభిమానపూర్వకముగాను.

కృష్ణుడు నీరసముగా కండ్లుమూసి కునికిపాట్లు పడినాడు. తరువాత నడిరాత్రి వానికి నిద్రలో తుపాకులు పేలిన చప్పుడు వినుపించినది. కాని వెంటనే తగ్గిపోవుటచే భ్రమయనుకున్నాడు. మరునటి యుదయమున ధనరాజునుంచి కథంతయు విన్నాడు.

"ఏకాక్షియును, వాని యనుచరుడును యీ ప్రాంతములనే నక్కియుండి, మరికొందరను సహాయము తీసికొని యొక రాత్రివేళ పోలీసు కచేరీమీదపడి తలుపు విరగగొట్టి సోములను విడుపించుకొని పోయినారు. సబినస్పెక్టరునకు భుజములోను జవానునకు కాలిలోను గట్టిదెబ్బలు తగిలినవి. పోలీసువారు గట్టిప్రయత్నము చేయుచున్నారు. నీ కేలాగున నున్నది నాయనా? కులాసగా నున్నదా?" అని యడిగినాడు.

కృష్ణునకు కొంచెము సులువుగనే యున్నది. అ మాటలే చెప్పినాడు. అంతలో డాక్టరువచ్చి భుజము చూచి తిరిగి కట్టుకట్టినాడు.

"దీనివిషయమై తొందరలేదు. మీరు జడియనక్కరలేదు. అబ్బాయి! అదృష్టవంతుడవు. పది పదిహేను రోజులలో నెమ్మది కాగలదు" అని ధైర్యముచెప్పినాడు.

"ఆ! అంత త్వరలోనా!" అని కృష్ణు డడిగినాడు హెచ్చరికగాను.

"ఆహా! సందేహించనక్కరలేదు. నా నమ్మకమది."

అని సమాధానము చెప్పినాడు.

"అయితే నేను త్వరలోనే యింటికి బయలుదేరి పోవచ్చును?" అని కృష్ణుడు మరల నడిగినాడు.

"త్వరలోనే యేమి. ఈవేళనే బయలుదేరి పోవచ్చును. ఆ! దాని కభ్యంతర ముండదు. కాని, ఏదయిన మెత్తని పక్క యున్న బండిలో కుదుపు లేకుండపోయిన మంచిది. కట్టునకు కావలసిన మందులు, దూది వగయిరాకూడ యిచ్చెదను. కట్టు కట్టుట తెలియునుకదా మీకు?" అని అడిగినాడు.

"ఆ. తెలియును" అన్నాడు రామచంద్రము.

డాక్టరు వెళ్ళిపోయిన తరువాత వారు ముగ్గురును భోజనములు చేసినారు. అక్కడ రామచంద్రము, ధనరాజు, కృష్ణుడును కలిసి ప్రయాణమునకు కావలసిన యేర్పాటులు చర్చించి స్థిరపరచినారు.

తరువాత నొకశుభ్రమైన సవారిలో రామచంద్రము వెంటరా గోపాలము నెమ్మదిగా నిల్లు చేరినాడు.

ధనరాజక్కడ కొనిన సామాను వగయిరా చేర్చుకొని మరుసటినాడు యిల్లుచేరి యేకాక్షివగయిరాల జాడ యెక్కడను కనుపించలేదనియును పోలీసువారు విశ్వప్రయత్నములు చేయుచున్నారనియును చెప్పినాడు.

"బహుశా వారు తిరిగి యే రంగూనులోనో, మోల్మెనులోనో యవతరించగలరు" అన్నాడు కృష్ణుడు నవ్వుచును.

  

## ౬

ఆరు వారములు గడిచినది. రామచంద్రమును గోపాలమును మరియొకసారి గూడెము వెళ్లినారు. అక్కడ వారికి కావలసిన సరుకు సామగ్రి కొనుటయే కాక నా యూరులో నొక శెట్టిదగ్గర యిచ్చి పుచ్చుకొను కాతాకూడ నున్నది రెడ్డి గారికి.

వా రక్కడ నొక చిన్న జట్కాలో పోయినారు. అప్పు డా ప్రదేశము సంవత్సరము పొడుగున నుండునటుల కునికిపాట్లు పడుచున్నది.

వారు, పోవు త్రోవలో పోలీసుఠాణాదగ్గర నాగినారు. అక్కడ పనిచేయుచున్న పోలీసు సబిన్స్పెక్టరు వారి నాహ్వానించినాడు.

“ఆహా! అబ్బాయిలు! ఏమి సంగతి? ఆ తుంటరులు మరల రాలేదుకదా మీమీదకు?” అని యడిగినాడు.

“ఆహా! లేదు. ఇక్కడకూడ కనుపించలేదనుకొనియెదను! వా రసలీ దేశమువిడచి పోయినారేమో నని మా యనుమానము” అన్నాడు గోపాలము.

“అందరాలాగుననే యనుకొనుచున్నారు. కాని నాకు మాత్రి మంతవరకు నమ్మకము చాలదు. నా యనుమానము నాకున్నది. ఎవరికిని చెప్పకూడదు” అన్నాడు పోలీసాయన.

"ఏదది? మే మెవరికిని చెప్పములెందు" అని రామచం ద్రమడిగి నా డాత్రిముగాను.

"వాడు యిదివరకొకసారి పశువులనుదొంగిలించి యొక గుహాలో దాచినాడటకాదా! ధనరాజు చెప్పినాడు నా కాలా గని" అన్నాడు యినస్పెక్టరు.

"మీా యనుమాన మదా? వా డిప్పుడా చోట దాగొన లేదు. మే మందర మవి వెతకి వెతకి చూచినాము. అన్నియు చూడకపోయినను వా గా ప్రాంతములకు పోయిన జాడలయి నను కనుపించలేదు మా బూసిగానికి" అన్నాడు కృష్ణుడు.

"మీా రప్పుడే తొందరపడకుడు. నా యనుభవమును పట్టి చెప్పుచున్నాను. ఆరితేరిన తుంటరు లెప్పు డీలాగుననే ప్రవర్తించెదరు. వాడు యిదివర కెవరును చూచియుండని మరి యొక గుహయొకటి కనిపెట్టి దానిలో దాగొని యుండును. ఆందోళన చల్లపడిన తరువాత కాని, వారు తిరిగి వెలుపలకు రారు."

"ఈసారి వెలుపల పడినప్పుడయినను వారు మీా చేతు లలో పడిన నదృష్టవంతులేమిారు" అన్నాడు రామచంద్రము.

"మా నమ్మకమదే. ఒంటరిగా నడవిప్రదేశములోను న్న మీారుమాత్రము కొంచెము మెలకువగా ప్రవర్తించిన మం చిది" అన్నాడు యినస్పెక్టరు.

చిన్నవాండ్రిద్ద రక్కడనుండి బయలుదేరినారు. కృష్ణుడు

త్రోవలో పనియుండి రొక దుకాణముదగ్గర బండితో నాగి పోయినాడు.

అతడు రామచంద్రుని చూచి "రామం! నేను నిన్న శెట్టియింటి దగ్గర కలసికొనిమెదను. నీవు త్వరగా పోవలయును. ఆలశ్యము చేయకుమా!" అని హెచ్చరించినాడు. రామచంద్రము తలయూడించుచు తొందరగా పోయినాడు.

అతడు గమ్యస్థానము చేరునప్పటికి శెట్టి లోపల నున్నాడు. వానిదొక పాతరకపు పెంకుటిల్లు. శెట్టిగారి పెద్దలనాటిదని యతడది విప్ప నిష్టపడలేదు. గట్టి దొకటి కట్టించనూ లేదు. కాని మన్యపుప్రదేశములకు మధ్యనుండుటచేతను, చుట్టుప్రక్కలనున్న కోయవాండ్ర కితడే పెట్టుబడిదారగుటచేతను, అప్పు తీసికొనిన వారిదగ్గరనుండి యెన్నిసారు లెంతవుచ్చుకొనినను అసలు అసలు లాగున మిగిల్చి చూపించు స్వభావము కలవాడగుటచేతను, అతనికి ప్రజలనిన యెక్కువ భయము. అందుచేత చావడికి చేర్చియున్న యినుపపెట్టి దాచుగదికి నాలుగుప్రక్కల రాతికట్టు కట్టించి మీాద దళసరియయిన యుక్కురేకు బలముగా తాపడము చేయించి బందోబస్తు చేయించినాడు. సాయంత్రము మూడుగంట లగునప్పటికి వ్యాపారము కట్టిపెట్టి, సొమ్మంతయు లోపలగదిలో బోషాణమంతయున్న యినుపపెట్టిలో పెట్టి, మూడు కప్పతాళములు—తాటికాయలంత యున్నవి—వేయుట యలవాటు. మూడు గంటలయిన

తరువాత కాగితములేకాని సొమ్ము వెలుపల నుండకూడదని వాని నియమము.

వీధి చావడిలో పెద్దగుమాస్తాయును జీత భత్యము లులేక తరిఫీజగుచున్న మరియొక కుర్ర సన్యాసియును తొందరగా పనిచేయుచున్నారు. ఇనుపపెట్టియున్న గదికాక చావడికి చేర్చి లోపల మరియొక చిన్న గదియున్నది. ఇనుపపెట్టి గదికి తాళము వేసిన తరువాత తాళములేకుండ తీయుట కొకరి తరముగాదు. బలవంతముగా బ్రద్దలుకొట్టిన నూరంతయు నల్లరగును. అక్కడ దొంగతనము జయప్రదముగా కొననాగునని యెవ రనుకొన గలరు?

రామచంద్ర మలవాటు ప్రకారము పెద్దగుమాస్తాను కలిసికొన్నాడు. అక్కడ నితరు లెవ్వరును లేరు. గుమాస్తా సహకారిని పిలచి రామచంద్రము తీసికొనివచ్చిన డబ్బు జమకట్టుమని చెప్పి "అయ్యా మీరు క్షణ మాలశ్యముచేసిన మాట దక్కక పోవును. ఏకాక్షి యల్లరితరువాత కచ్చితముగా మూడుగంటలకు మూసివేయుచున్నాము. మా శెట్టిగారికి గుండెలు చేతులలో నున్నవి. మీ వానిచేయి బాగున్నదా?" అని యడిగినాడు.

"ఆహా! అంత ప్రమాద మేదియును లేదు. మానిపోయినది." అని రామచంద్రము సమాధానము చెప్పినాడు.

అంతట గుమాస్తాయును రామచంద్రమును కులాన

గా కబుర్లు చెప్పుచు ప్రక్క వసారాగదిలోనికి పోయినారు. గుమాస్తా యక్కడనున్న పటములు వగయిరా చిన్నవానికి చూపించినాడు. రామచంద్రము పటములు చూచి యక్కడనున్న వార్తాపత్రిక చూచుచు నా గదిలో నిలచిపోయినాడు. గుమాస్తాపని చూచుకొనుటకు వెలుపలకు వచ్చినాడు. అంతయు నిశ్శబ్దముగా నున్నది. కాగితముల రప రప తప్ప యితర యలకడ యేదియు లేదచ్చట.

అంతలో కృష్ణుడు పనిముగించుకొని శెట్టి యిల్లు సమీపించుచు కొంతలో తలయెత్తి ముందునకు చూచి సవ్వోరపడి "ఇది యేమి? ఆ వచ్చువారెవరు?" అని యనుకున్నాడు.

ఎవరో ముగ్గురు మానవులు వీధచివర ధూళి రేగకొట్టుకొనుచు గుర్రములమీద వచ్చుచున్నారు. వారక్కడ శెట్టి యింటిముందాగినారు. వారి ముగ్గురకు దట్టమయిన గడ్డములు, నిండయిన తలపాగలు నున్నవి. ముఖము లానవాలు తెలియులాగున లేదు. వారిలో నొక డక్క డాగిపోయినాడు. ఇరువురు క్రిందకు దిగినారు.

వారు తొందరపడకపోయిన మాటదక్కదు. మూసివేయు వేళ యయినది. ఎవరో వింతమనుష్యులు లాగున నున్నారు. ఆ! ఇనుపపెట్టి తలుపులు వేసిన చప్పుడు వినిపించినది.

దిగిన యిరువురు లోపలకు పోయినారు. మూడవవాడు గుర్రములకు కాపున్నాడు. వాడు చీడీలు యెక్కునంతలో త

లుపు మూసివేసినారు. నాటికి శెట్టి వ్యాపారము ముగిసినది.

గదిలో పత్రిక చూచుచున్న రామచంద్ర మక్కడ నున్న పడకకుర్చీలో కూర్చుని యొక బొమ్మల మాసపత్రిక లోని బొమ్మలు చూడసాగినాడు. వానికి త్వరలోనే కునికి పాట్లు రాజొచ్చినవి. అంతలో వానికి ప్రాతపరిచితమయిన దానిలాగున కనుపించిన కఱకు గొంతుస్వర మొకటి ప్రక్కగో లులో నుండి వినుపించినది.

"చేతులు మీాద కెత్తుడు. మీా యిరువురును. త్వరగా!" అని.

పెద్దగుమాస్తా యాశ్చర్యముగను, రెండవ గుమాస్తా కం గారుగను కేకలు వేసినారు. మధ్యనున్న తలుపు వేసియుండుట చేత రామచంద్రున కేదియు కనుపించలేదు. అతడును కను పించలేదొరులకు.

"అటుపోయి వానిదగ్గరి తాళముచెవులు తీసికొనుము" అని వినవచ్చిన దా స్వరము మరి యొక సారి. రామచంద్రు డిప్పుడు స్పష్టముగా గురుతించినాడు. ఎవరును, అనుమానిం చుట కయిన నవకాశములేని సమయమున తిరిగివచ్చినాడు యేకాక్షి.

ఏకాక్షి తీవ్రముగా "మీాలో నెవరు కదలినను పిస్తోలు దెబ్బ తినగలరు. మీాకు హాని కలుగచేయుటకు రాలేదు మే ము. మా వ్యాపారము మేము చక్కపెట్టుకొన వచ్చినాము.

ఊ, త్వరగా తాళములు తీసికొని యా మూలనున్న యినుప పెట్టె దగ్గరకు పొమ్ము" అన్నాడు.

అందు మొదటి మాటలు చెవిని పడినంతనే రామచంద్రము మెల్లగా పుస్తకము బల్లమీదపెట్టి జేబులోని పిస్తోలు సర్వసిద్ధముగా పట్టుకొని జాగ్రత్తగాలేచి యించుకయిన శబ్దము కాకుండ పిల్లిలాగున నడుగులిడుచు ముందునకు పోయినాడు. అత డాకస్మికముగా తలుపుతెరచి పిస్తోలుముందునకూపినాడు.

ఏకాక్షి మెరపు లాగున గిర్రున వెనుకకు తిరిగినాడు. రాముడు పిస్తోలుపేల్చి, యేకాక్షి పేల్చునంతలో చంగున ప్రక్కకు తప్పుకొని దెబ్బమీద దెబ్బగా రెండుమూడు దెబ్బలు కొట్టినాడు. రెండవవాని చేతికి దెబ్బతగులుటచేత నతడు తాళముచెవుల గుత్తి నేల జారవిడచుట చూచినాడు.

ఢాం! ఢాం! అని రెండుగుండ్లు రామచంద్రియున్న గుమ్మమునకు తగిలి, ద్వారబంధపు కర్రముక్కలను క్రింద పడ కొట్టినవి. కాని వానికి తగలలేదు. మరుక్షణముననే వచ్చిన యిరువురును వీధి తలుపు విసరికొట్టి, మూసి, పారిపోయినారు. రాముడు వారివెంట పడినాడు.

"సెహబాస్! అబ్బాయి కొట్టు!" అని పురికొల్పినాడు గుమాసా.

ఢాం! ఢాం! అని వీధిలో తుపాకి చప్పుడు వినుపించినది. రామచంద్రుడు తలుపు తెరచుకొని వీధిలోనికి పోవునప్పటికి గుర్రములమీద పడి ప్రాణములకు తెగించి పారిపోవు

చున్న ముగ్గురు బుద్ధిమంతులు వానికి కనుపించినారు. తొందర
రగా తుపాకిలో తిరిగి క్రొత్తతూటాలు తగిలించు వానికి కృష్ణు
డు కంటపడినాడు. చప్పుడు విని సంగతేమని యడుగుచు వీధి
లో కాపుర మున్నవారు చాలవరకు తలపులు తెరచుకొని
వెలుపలకు వచ్చినారు.

కృష్ణుడు వారివెంట పరుగెత్తినాడు. కాని ప్రయోజన
ము లేకపోయినది. రాముడును కృష్ణుడును సంగతి మాటలాడు
కొనునంతలో గుమాస్తావచ్చి వారిని కౌగలించుకొని "నాయ
నలారా! మీరు మాకు మంచి సహాయము చేసినారు. మీరు
తరుచు వారినోట బెడ్డకొట్టుచునే యున్నారు. ఇదివరకు తీర్థ
మురోజున హాటలులో దౌర్జన్యముచేసినది వీరే కాదూ?"
అని యడిగినాడు.

"అవును. ఏకాక్షియును, జోగులును. మూడవవా
డానవాలు తెలియలేదు" అని రామచంద్రము సమాధాన
ము చెప్పినాడు.

శెట్టి కేవిధమయిన నష్టమును కలుగనందుల కందరు
ను సంతోషము నటించినారు. చిన్నవాండ్రను పొగడి, పొగడి
యానందించినారు.

తెల్లవారినది. క్రిందటి సాయంత్రము దొంగలు పారిపో
యినచాలసేపటికి బయలుదేరి వారివెంట పోయినపోలీసువారు
కాళ్ళీడ్చుకొనుచు నూరు చేరినారు. పారిపోయిన వారి గుఱ్ఱ
పుడెక్కల జాడలు కొంతవర కస్పష్టముగా నయినను కనపించి

నవి కాని తరువాత నల్లరాతికొండలమీద నెంతమాత్రమును గురుతు తెలియవచ్చినవికావు. మంచి తెలివికలవారిని కూడ మోసగించినవి. ఏకాక్షి వాని పరివారముతో మరియొకసారి పోలీసువారిని, చట్టమును ధిక్కరించి దాటిపోయినాడు. కాని చేతికేదియు దొరకలేదు.

కుర్రవాళ్లు తిరిగి యింటికిపోవు మార్గములో రామచంద్రము "వీ రంత ప్రమాదపు రకములోనివారు కారు. ఎంత కాలము చేసినను యొకటి రెండు పశువుల నెత్తుకొనిపోవుటయో, చిల్లర దొంగతనములు చేయుటయో: అంతకన్న నెక్కువ లేదు. కడుపు కక్కుఱితి. తిండి యున్న మర్యాదగనే ప్రవర్తించగలరు" అన్నాడు.

"ఆ. దానికేమి? ఏకాక్షికి మనము తిండిపెట్టి బట్టయియ్యలేదూ? వానిదరిద్రము కాని. వీరు క్రమముగా మితిమీరుచున్నారు. శెట్టి యినుపపెట్టి మంచి బేరమనుకున్నారు. మాట దక్కినదికాదు. దక్కినదానికన్న వారు దొరకిపోయిన శిక్ష యెక్కువ యగును. న్యాయమార్గమే మంచిదని నా నమ్మకము" అన్నాడు కృష్ణుడు.

"కాని యినస్పెక్టరునుచూచిన నాకు కష్టముగా నున్నది పాపము. ఈ గ్రామములో దౌర్జన్యముచేసి వారు తప్పించుకొని పోవుట కిది రెండవసారి. ఈసారి పోలీసువారికి మంచి చీవాట్లు తగలకలవు యధికారులవలన" అన్నాడు రాముడు.

"ఆ! అందుకు సందేహముండదు. మన మనుకొన్నటుల

యేకాక్షిగాడు యెక్కడనో మంచి నమ్మకమైన గుహ యొకటి కనిపెట్టి యుండవచ్చును దాగొనియుండుటకు. మనమది వెతకి పట్టుకొనిన మంచి......"

"మంచి దెబ్బలు తగులును తుపాకితో! చిత్తము. ఆ గొడవ మనకెందులకు. ఇంటి దగ్గర మన పని మనము చూచుకొనిన చాలును, అనవసరముగా వానితో మనకెందులకు. మనమీదకు వచ్చినప్పుడు వారి సంగతి చూడవచ్చును" అన్నాడు.

అ దంత పురుషలక్షణము కాదు. కాని ప్రకృతిలక్షణము. వారు యిల్లు చేరిన తరువాత గోపాలుని తండ్రి చెప్పిన మాట కూడ నదే. ప్రపంచానుభవము గల పెద్దముండవాడు.

"మీరు వారికి నూదికంటురాళ్ళలాగున నున్నారే? ఇది నాలుగవ సారి యనుకొనియెదను వారి నెదుర్కొనినది మీరు? ఇకముందు మెలకువగా నుండవలయును. మీ మీద ద్వేషము కొలది వారు మిమ్ములను చూచి చూచుటతోడనే దూరమునుంచి యయినను తుపాకి పేల్చగలరు. వారు నిర్బంధమున పడువరకును మీరు కనుమెలగి ప్రవర్తించుట మంచిది" అని సలహా యిచ్చినాడు రెడ్డి.

"సరే. మీ మాటకు వ్యతిరేకించువారమా మేము!" అన్నారు యిరువురును.

తరువాత నక్కడి వ్యవహార మెప్పటిలాగున జరిగిపోవుచున్నది.

# ౧౦

ఒకనాటి యుదయమున కృష్ణుడును రాముడును యింటికి చేరువనున్న పొలములో కట్టవ బాగుచేయించుచున్నారు. ప్రక్కనున్న రోడ్డుమీదనుండి "ఆహా!" అను కేక వినబడినది. అటుతిరిగిన వారికి వయసుమీరిన, బలమైన మనుష్యుడొకడు కనుపించినాడు. అతడు వారున్న వైపునకే వచ్చుచున్నాడు.

అతడు "ఆహా! పిల్లకాయలు! నేను చూచినతరువాత చాలవర కెదిగినారే. నన్ను మరచిపోయినా రనుకొనియెదను బాబూ!" అన్నాడు.

"ఆహా! లేదు. మీరు మల్లయ్యదొరగారు!" అన్నారు కుఱ్ఱవాండ్రు.

అతడు సుమారు, అయి దారు సంవత్సరముల క్రితమొకసా రక్కడకు వచ్చి, కొన్నిమాసములపా టక్కడ రహస్యముగా కాలక్షేపణచేసి పోయినసంగతి వారికి జ్ఞాపకమున్నది. అత డధికారులకు జడిసి కొంతకాలము దాగొని తిరిగి పరివారమును సమకూర్చుకొని, యెప్పటి యాట ప్రారంభించిన యొక కొండదొంగ యని మన కుఱ్ఱవాండ్రకు సరిగా తెలియకపోయినను, అంతవరకు గట్టి యనుమానము మాత్రమున్నది. అత డతిసాహసికుడనియు, బలవంతుడనియు, కచ్చి

తమైన పద్ధతులు కలవాడనియు వాని వాలకమును, కబురులు ను వెళ్ళడి చేయుచున్నవి.

అతడు నలుగురకును మన్యపువర్తకము చేయునటుల నటించి ప్రవర్తించినను వాని యసలువ్యాపారము మాత్రము, డబ్బుకు నాలుగుడబ్బులు లాగుటకు నోరులేని యమాయికపు కోయవాండ్రను మోసగించు యసలువర్తకులను త్రోవకొట్టి ధనము సంపాదించి, యందులో కొంత యనుచరులకిచ్చి మిగి లిన దానిలో చాలవరకు బీదకోయలకు విదజల్లి వారి కన్న వస్త్రము లొసంగుచుండుటయే!

అంతట కృష్ణుడు "మీరు కొంతకాలము మాతో నిచ్చట కాలక్షేపణ చేయుదు రనుకొనియెదను? మాకు చాల నానందముగా నుండును" అని యడిగినాడు.

"నేను ప్రస్తుత మిచ్చట నంత యెక్కువకాల ముండు టకు సావకాశము చాలదు. నే నీమధ్య మా గ్రామమున నొక దేవాలయము కట్టించినాను. దానికి ధ్వజస్తంభమునకు పనికి వచ్చు మంచి చెట్టొకటి మీ నాయనగారి నడిగి పట్టుకొనివెళ్ళ వచ్చినాను" అనుచు నతడు యింటికి కొంచెము దూరమున నున్న యెత్తయిన చెట్లవయిపు దీక్షగా చూచి పరిశీలన చేసి నాడు.

అతడు దూరమున నెత్తుగ నిడుపుగ నున్న బలమైన చెట్టొకటి చూపి "అదిగో! ఆచెట్టు పనికివచ్చును. నాకు కావ లసిన దట్టిదేను. అది నా కిచ్చుటయేగాక, పడకొట్టి పట్టుకొని

పోవుటకు తగిన సహాయముకూడ నొసంగిన బాగుండును మీ నాయనగారు" అన్నాడు.

"ఆహా! దానికేమి. కాని మీరంత తొందరగా బయలు దేరి పోవ రనుకొనియెదను!" అన్నాడు.

అత డెవరయిన పొంచుండి వినుచుందురని సందేహించినటుల నలుప్రక్కల చూచి, స్వరము తగ్గించి గుస గుసలకు దిగినాడు.

"అబ్బాయిలు! మీతో చెప్పకపోవు టెందులకు. నే నిక్కడనుండి త్వరలోనే పోవలయును. ఎంతనిర్మలముగా నున్నను, యీ ప్రాంతములను నమ్మవీలులేదు. అదికాక నిప్పుడు నా దగ్గర నున్న వస్తువొకటి నా దగ్గరనుంచ వీలు లేదు. కొంతకాలము మీదగ్గర దాచి పోవలయును. అది నా దగ్గర నున్నటుల తెలిసిన నది "నాది" "నాది" అని ప్రతివాడు ను తగువుపెట్ట చూచును. అందుచేత నది యొక గౌరవమయిన చోట దాచిపెట్టి స్తంభము పట్టించుకొని త్వరలో లేచి పోవుట మంచిదికాదా." అన్నాడు.

"మీ రంత జాగ్రత్తగా దాచిపెట్ట తలచుకొనిన వస్తువేదో మేము తెలిసికొన కూడినచో చెప్పుడు. దయయుంచి!"

అతడు మరియొకసారి నలుప్రక్కల చూచి రహస్యముగా "మీకు చూపించెదను." అని మొలలోనికి చేయిపోనిచ్చి, చిన్న తోలుసంచి యొకటి వెలుపలకుతీసి, తాడులాగి, మూతి

విప్పి యందులోని సరుకు కొంత యెడమ యరచేతిలో తిరుగ పోసి చూపించినాడు.

"ఆహా! ఎంత యందముగా నున్నవి!" అన్నాడు కృష్ణుడు.

"చాల ఖరీదుండును కూడను" అన్నాడు రాముడు.

"బాబూ! అవి నలువదిరెం డున్నవి. అన్నియును మంచిరకము రత్నములే! పెద్దరకము. దీనిసంగతి మీరు గ్రహించలేరు కాని కరీదు కట్టిన మూడు, నాలుగు లక్షలకు తక్కువుండదు. ఇవి దగ్గర జాగ్రత్తపెట్టి చిక్కు తెచ్చిపెట్టుకొనునేమో నా స్నేహితు నడిగి తెలిసికొనవలసి యున్నది. నేను స్తంభము యిల్లు జేర్చి, దేవాలయము పూర్తి యగులోపల నొక్క సంతారముచేసి, పేరు చిరస్థాయి యగునటుల, మాయవర్తకుల గుండెలూ మరి పది సంవత్సరముల వరకు దడదడలాడి న్యాయప్రవర్తన నాశ్రయించునటుల, కోయలకు కరువుతీరునటుల చేసి, వ్యాపారమునకు స్వస్తిచెప్పి, జట్టునకు సెలవొసంగి పోలీసువారికి నమస్కరించి, విశ్రమించెదను. నా యీ వ్యాపారమునకు నన్ను నిందించువారికన్న మెచ్చుకొనువారే యెక్కువయున్నారు. వర్తకులను సంతోషపెట్టుటకయి పోలీసధికారు అప్పుడప్పుడు నా మీద దండయాత్రలు బయలుదేరదీసి చిల్లరప్రయత్నములు చేసినను, నా వ్యాపారమును దాని యభిప్రాయమును గురుతించి వారు నా మీద కంతగా రారు. దేవాలయము పూర్తియయిన తరువాత నేను "కృష్ణా! రామా!"

యని యొక మారుమూల కూర్చుందును."

అప్పటికి, వాని ముఖమున నున్న రెండు మూడు తీవ్రమయిన పోటుగుపాటి మచ్చ లభిప్రాయ పూర్వకముగా చూచుచుండిన కృష్ణుడు "మీ కుటుంబుపోవునా కండ్లు మూసికొని కూర్చుండిన?" అని యడిగినాడు. వాని ముఖములోని మచ్చలొకటి పూర్వమతకు "అగ్గిబాబు" అని వ్యవహరింపబడుచుండిన రోజులలో ప్రతికక్షుల యీటె పోటున నయినది. రెండవది పోలీసువారి తుపాకి గుండు దూసికొనిపోయి కణత గాయపడి నప్పటిది. అట్టివి తెలలోను శరీరము మీదను చాల గనున్నవి. అవి వానికంత లెక్కలోనివి కావు.

"నాయనా! కృష్ణా! ప్రతిమానవుడును విశ్రాంతియును యీశ్వర ధ్యానమును యపేక్షించుసమయము వచ్చును. అది మొదట కష్టముగా నుండుమాట వాస్తవమే కాని యలవాటుపడినతరువాత విబ్బంది యుండదు. ఎల్లప్పుడును కష్టపడిన సుఖజీవన మెవ్వడు. అవసానమున విబ్బంది పడిన వారిని చాలమంది నెరుగుదును నేను. అట్టిసంఖ్యకు మరియొకటి చేర్చుట నా కిష్టములేదు. పీలు కలిగిన నిర్మలముగా నే నీటివసతి కలచోటనో చిన్నభవనములో రెండు పాడిదూడలను పెంచుకొని కృష్ణా! రామా! యని సుఖపడుటకన్న వలసిన దేమున్నది మానవునకు? సరే దాని కేమి. మీనాయనగారింటిదగ్గర నున్నారా?" అని యడిగినాడు.

"ఆ! ఉన్నారండి. ఉద్రేకపూరితములైన మీ వింత

కథలు మాకు సాయంత్రము భోజనమయిన తరువాత చెప్పుదువు కాని. ఉంచుడు. మే మీ లోపున నిచ్చటిపని పూర్తిచేసి కొని వచ్చెదము."

"అలాగే" అనుచు నతడు వారియింటివైపు తీరుబడిగా నడచి పోయినాడు.

ఇంటిదగ్గర రెడ్డి వానిని హృదయపూర్వకముగా నాహ్వానించినాడు. తత్వములు పరస్పర విరుద్ధము లయినను, ఒక్కసారికాక, సుమారొకటిన్నర డజనులసారులు చట్టధిక్కారము చేసి స్వేచ్ఛగా సంచరించిన వానిని చూచిన రెడ్డికి మంచి యభిమానము. వీరపురుష లక్షణము.

కొంతకాలము సంభాషణ యయిన తరువాత "అగ్గిబాబూ! నీవు తొందరగా పోకతప్పదనిన మేము నిన్ను నిర్బంధించువారము కాము. నీకు కావలసిన చెట్టు యీ పూటయే కొట్టించి సరిచేయించి తీసికొనిపోవుటకు కావలసిన యెడ్లను కూడ నిచ్చెదను. ఈ లోపున——"

అంతలో రెండవ యతడు వానిమాట కడ్డువచ్చి "ఈ లోపున నీ వీ సరుకు పుచ్చుకొని, యే పట్టణపు బేంకులో నయిన జాగ్రత్త చేయించుము నీపేర" అనుచు నతడు చిన్న తోలు సంచి తీసి, సరుకు కొంత బల్లమీద పోసి "మంచి అందముగా నున్నవి కాదూ!" అన్నాడు.

"చాలా మంచిరకము. అందముగా నున్నవి. ప్రశస్తమయిన సరుకు" అని యంగీకరించి, రెడ్డి ప్రక్క గుమ్మము

దగ్గర కొంచెము చప్పుడగుటచేత తొందరగా "త్వరగా, సంచి లో పోసివేయుము. ఆ యినుపపెట్టిలో పెట్టివేయుదును" అన్నాడు.

అతడు తొందరగా పోగుచేసి సంచిలో వేసినాడు కాని యించుక యాలశ్యమయినది. అంతలో వంట చేయు నాయరు గదిలో ప్రవేశించి, వాటిని చూచినాడు కాని చూచినటుల వెళ్ళడి కానీయలేదు. మల్లయ్యదొర వానిని తీక్షణముగా చూచి వికటముగా నవ్వినాడు.

అతడు "ఏ రంద రొక్కమాదిరిగనే యుందురు. వీనిని నే నెరుగుదు ననుకొనియెదను? అబ్బాయి! నేను జ్ఞాపకము న్నానా నీకు? ఆనాడు బ్రాందీసీసా కాళీచేసినందులకు తో ఛ్యాడునటుల కొట్టించినది నిన్నే కాదు? జాపక మున్న దా?" అని యడిగినాడు తాజుగా.

అతడు తాజుగా "చిత్తము. జ్ఞాపక మున్నది. మహా గట్టిగా కొట్టినారు. అక్కడనుండియే యిక్కడకు వచ్చినాను." అన్నాడు కాని చూపులో మంచి క్రూరత్వము స్ఫురించినది.

"నీ కంతవరకు కావలసినదే. కోతిముండకొడుకా! ఏమయిన నేమిలే. ప్రాతకథకు నీకు కొంచె మిానాము. ఇదిగో! నీవు మంచి వంటవాడవు." అనుచు నతడొక రూపాయి విసరి నాడు వంటవానివయిపు. అత డది క్రింద పడకుండ చమత్కా రముగా నందుకున్నాడు.

"చిత్తము. తమదయ" అనుచు నెమ్మదిగా వెలపలకు జారినాడు.

కాని తలుపువెలుపల వాని ముఖ మాకస్మికముగా మార్పుచెందినది. అసూయయావహించినది. పండ్లు పట పట కొరికి రూపాయిని గ్రుద్దునటుల పిడికిలి విసరి, దానిమీద నమ్మిన వానియెడల నున్న కడుపుమంట యారీతిగా తీర్చుకొన్నాడు. మారుమాటలేక మెరపులాగున వంటశాలవయిపు పరుగిడినాడు.

అంతట గృహయజమాని మెల్లగా "వాడివి చూచినాడు. చూడకుండిన బాగుండెనివి" అన్నాడు.

"ఆ! ఏమయిన సక్కజిత్తులు పరిమోగించ ప్రయత్నించిన గుండువేసి కొట్టివేయుము. కోతివెధవ. ఏమయిననేమి వీడు. ఇదిగో! నీ యినుపపెట్టె తగినంత దృఢముగనే కనుపించుచున్నదే?" అన్నాడు.

"ఆ! మంచిబలమైనదే. ఈ నాయ రిదివరకు చాల కాలమునుంచి పనిచేయుచున్నాడు నాదగ్గర. నేను వానిని బాగుగనే చూచుచున్నాను. విశ్వాసముగనే పనిచేయుచున్నాడు నా దగ్గర. అంతవరకు సందేహము లేదు."

"ఆహా! మళయాళపువాని నెన్నడును నమ్మకూడదు. వీ డసలు నాదగ్గరకు వచ్చునప్పటి కితడు రెండువందల రూపాయిలు పుచ్చుకొని వీడి తోటివాని నొకనిని చంపివేసినందులకు పోలీసువారు వెతకుచున్నారట వీని కోసము. తరువాత చాల

కాలమునకుకాని తెలియలేదు నాకు. అప్పటి కప్పుడే వాని వంట మాకు రుచికరముగా నుండి వాని మీద మా కభిమానము పుట్టించినది. ఏది యెటులున్న వీడప్పటికి మంచి వంటవాడు మాత్ర మవును."

"ఇప్పటికిని" అనుచు రెడ్డి యా వజ్రములసంచి యినుపపెట్టిలో పెట్టి తాళము వేసినాడు.

అతడు తరువాత నిద్దరు ముగ్గురు పనివాళ్లను పిలచి, గొడ్డళ్లు, తాళ్లు తెప్పించి, అగ్గిబాటునకు కావలసిన చెట్లు నరుకుటకు పురమాయించి పంపినాడు. కృష్ణుడు చేలిలోని పని విడిచిపెట్టి యక్కడకువచ్చి, కావలసిన సాధనసామగ్రి తీసి పనివాండ్రు వలదనుచున్నను వినక యందరకన్న ముందు చురుకుగా చెట్టుమీదకు ప్రాకిపోయి, వెంటతీసికొనిపోయిన తాళ్ళక్కడ బిగకట్టి, వాటి రెండవ కొసలు క్రిందకు విసరినాడు. ఆ చెట్టు యేటవాలుగా నుండుటచేత తాళ్లుకట్టి, బిగపట్టి యుంచకపోయిన పక్షమున పల్లమువైపు పడి, మిగత చెట్లకు ప్రమాదము కలిగించునని యట్లు చేయవలసి వచ్చినది.

అతడు తాళ్ళు బిగించిన తరువాత నొకసారి నలుప్రక్కల తేరిపార చూచినాడు. అక్కడకు వారియిల్లు మాత్రమే కాక యింటికి వెనుకవైపున నున్న వంటవసారాకూడ స్పష్టముగా కనుపించుచున్నది. అందునుంచి పొగ బయలుదేరినాయు రావూట భోజనమునకు కావలసిన సామగ్రి తయారు

చేయుచున్నాడని చాటి చెప్పుచున్నది. అంతలో నాయరు వెలుపల కనుపించినాడు.

ఆ బుద్ధిమంతుడు వసారాలో నిలచి, యంతకుపూర్వము వాని యజమానియు మిగతవారును పోయినవైపు శ్రద్ధగా పరిశీలించి చూచినాడు. కృష్ణుడు, ఆకులచాటున నుండుటచే వానికి కనుపించలేదు. కృష్ణుడు కదల మెదలక క్షణకాలమక్కడనే నక్కి కూరుచున్నాడు. తన్నితరులెవరును చూచుచుండుట లేకని పూర్తిగా సంతుష్టిపడి నాయరు మరియొకసారి నలుప్రక్కలచూచి, తొందరగా వసారాదిగి ప్రక్కనున్న డొంకలలోనికి పరుగిడి క్షణములో మాయమయినాడు.

యజమాని "ఏమి కృష్ణా? ఎందు కక్కడ నిలచిపోయినావు? ఆలాగున క్రొత్తగా చూచుచున్నావే మింటివైపు? ఇదివర కెన్నడును చూడలేదా? దిగిరమ్ము తొందరగా. ఇంకను చాల పనియున్నది" అని హెచ్చరించినాడు.

కృష్ణుడు మాటలాడక క్రిందకు దిగినాడు. వాని మనసిక్కడ లేదు. ఇంతకును నాయ రా డొంకలలోనికి పోవుటకు కావలసినన్ని కారణము లుండవచ్చును. అతడు కూరలలో నుపయోగించుట కా డొంకలలోని యాకులు కొన్ని తెచ్చుచుండుట యలవా టప్పుడప్పుడు. అత డిప్పు డట్టి దేనికొరకో పోయియుండును. అందుచేత కృష్ణు డాసంగతి వారికెవరికిని తెలియపరచకనే సొంతపనిలో నైక్యమయిపోయినాడు.

గొడ్డళ్ళు చురుకుగా పనిచేసినవి. ఒక యరగంటలో నా చెట్టు పడ పడలాడుచు, చప్పుడుచేయుచు సావుగా నేల కూలినది. పనివాండ్రు మధ్యనున్న చిన్నకొమ్మలు చెలుగుచున్నారు. యజమానియును, యగ్గిబాబును యింటివైపుమరలినారు. మరికొంచెములో రాముడును, కృష్ణుడునుకూడ నిల్లు చేరినారు.

సూర్యాస్తమయ మగుచున్నది. పడమరదిశ యంతయు, కరగించి ప్రవహింపజేసిన బంగారు సముద్రములాగున కన్నుల కానందము కలిగించుచున్నది.

"అమ్మో! దూరమున నా మంటయేమి?" అని రామచంద్రము కంగారుగా నరచి, యత డింటికి సుమా రొక మైలు దూరమున నిలువుగ నాకాశమంతయెత్తు లేచిన నల్లని పొగవైపు చేయిచాపి చూపి "అది మన పనివాళ్ళదయి యుండదు. ఈవేళ నా వైపున పనిచేయువా రెవ్వరునులేరు" అన్నాడు.

"నే నింతకుపూర్వము చెట్టుమీద నున్నప్పుడు నాయరా వైపునకు పోవుట చూచినాను. వా డంటించి యుండును. అంతవాడు కాడనియెదవా?" అన్నాడు కృష్ణుడు.

"వా డంతవరకు చేయవలసిన యగత్య మేముండును? ఆహా! ఉండ కేమి? నాయ రనవసరముగా శ్రమకలుగచేసి కొనడు. లేక—అక్కడ నెవరయిన 'శుకాలీ' వాండ్రు మకా

ముచేసి యుండినవారిని మన నాయరు గుఱుతించి వారి కేదయి నసామగ్రి యమ్ముకొనుటకు పోయియుండును. వంట వాండ్రు సర్వసాధారణముగా నట్టి కక్కుఱితి పనులు చేయుచుందురు. ఎంతయయినను వారిని మానిపించచాలము మనము" అన్నాడు రాముడు.

"అయియుండవచ్చు. అట్టిది మనము చూచియు చూడనటుల నూరకొనవలయును" అన్నాడు కృష్ణుడు. తరువాత నా సంగతే లేదు.

భోజనములు కులాసగా ముగిసినవి. అగ్గిబాబు వారికి మధ్య మధ్య హాస్య రసము కలసిన తన సాహసకృత్యములు చాలవరకు వినుపించి విందునకు జీవనము పోసినాడు.

అతడు సుమారు ఇరువది సంవత్సరముల కాలము బందిపోటుగా జీవయాత్ర కడపుటయే కాక నందు కొంతకాలము మన్యపు పితూరీలు లేవతీసి పోలీసువారికి గుండెలలో నిబల్లెమై, సర్కారువారి కెదు రొమ్ముమీది కుంపటయై వర్తిల్లినాడు. అవన్నియు నిందుదహరించి యీపుస్తకము విస్తరింపజేయజాలము. అతని సాహసౌదార్యములును, వాని యనుచరుల చర్యలును పూర్తిగా వివరించుటకును వేరొకగ్రంథ ముండవలయును. అది తరువాత——

 

## ౧౧

రాత్రి నిర్మలముగా గడచిపోయినది. మరునటి యుద యమున యజమాని పెందలకడ లేచి, మిగత వారి నందరను లేపి, దూలము తీసికొని పోవుటకు బలమైన యెనిమిది దున్నల ను నలుగురు మనుష్యులను జతయిచ్చి, యగ్గిబాబును చాలా దూరము సాగనంపినాడు. వారు విడిపోవునపుడు "పని తొందర తీరిన తరువాత మీరు తీరిక చేసికొని వచ్చి, మా యింటి దగ్గర నాలుగురోజులు గడపి మరి పోవుదురని, నానమ్మకము" అని యాహ్వానించినాడు రెడ్డి.

"అలాగే. అందు కభ్యంతర మేమి. ప్రస్తుతము సెలవు" అని వెనుకకు తిరిగి చురుకుగా నడక సాగించినాడు.

పెద్దరెడ్డి తాజుగా "అతడు మనదగ్గర నుంచిపోయిన రాళ్ళు సాధ్యమయినంత త్వరలో 'బేంకు'కు పంపి వేసిన బాగుం డును. అవి మనలను విడిచి యే పెద్ద బేంకులో నయిన స్థిరపడు వరకును నాకు మనస్థిమిత ముండదు. మళియాళవు వాడివి చూ చినాడు. ఎంత విశ్వాస పాత్రులయినను నా జాతిని నమ్మి యుండ జాలము కదా! నా కొక వారము రోజుల వరకును తీరిక యుండదు. అప్పుడు కాని యవి విడుదల కావు. అంతవ రకు మీరు వంతులు వేసికొని యీ పెట్టిదగ్గర కాపుండుడు.

ఎందుకయినను మంచిది. ఈ వేళ కృష్ణునివంతు" అన్నాడు క్షత్రవాండ్రను చూచి.

కృష్ణుడు మొదట మూలిగినాడు కాని యంగీకరించి పుస్తక మొకటి పుచ్చుకొని, పిస్తోలు పూర్తిగా సరుకుతో నిండియున్నదని స్థిరపరచుకొని, కిటికీదగ్గర కూరుచున్నాడు.

తండ్రి కొంచె మనవసరముగా వ్యవహరించుచున్నటుల కనుపించినది వానికి. మళయాళవు వానికి రత్నములన్న నేమిరాం తెలిసియుండదు. ఒకవేళ తెలిసి వాటిమీద యాశవుట్టినమాట వాస్తవమే యయినను యతడు వాటిని తాకుటెట్లు? తాళము చెవి దొరకినను రాయిలాగున నున్న యినుపపెట్టి కీలకము తెలియకుండ తెరచుటకు దేవునకయినను తరముకాదు. దాని తాళము చెవి రెడ్డి నిరంతరము మొలలో కట్టుకొని తిరుగుచుండును.

"ఆ నాయరంత మొదటిరకము దొంగయయి, యట్టిపనికి కావలసిన పనిముట్లు నిరంతరమూ వెంటపెట్టుకొని తిరుగుచునేయున్నను, యంతటి బలమైన పెట్టి నత డేమి చేయకలడు. తాళముచెవి లేకుండ తెరువవలయునన్న వజ్రపుపొడికల పోగరుతో రంధ్రముచేయుట తప్ప వేరు మార్గమేదియు కనుపించదు. దానికైనను కావలసినంత వ్యవధి కావలసియుండును;" అని యాలోచించుచు కృష్ణుడు నిర్విచారముగా కూరుచున్నాడు. నాయ రక్కడి సామాను సదురుచుండుట పరధ్యానము

గా చూడసాగినాడు. వంటవా డెప్పటిప్రకారముగనే యున్నాడు. గదిలో మూలకు జేర్లబడి కునికిపాట్లు పడుచున్న రాయివంటి యినుపపెట్టి యందాసక్తి యున్నటుల వానిముఖమున నే సూచనయు కనుపించుటలేదు. అతడటు నిటు పచారు చేయుచు మందముగా నీలవేయ సాగినాడు.

క్షణకాలము గడచిన తరువాత నత డస్పష్టముగా "అయ్యా! ఆవెళ్లిపోయిన ఆయన తిరిగి వస్తారా అండీ యిక్కడకు? నేను కూడ నాయనవెంట పోయిన బాగుండును. ఆయన చాల మంచివారు" అన్నాడు.

"ఆ! త్వరలోనే రావచ్చును. కాని నీ విదివరలో నెవనినో చంపితివట వాస్తవమేనా?" అని కృష్ణుడడిగినాడు.

"మేము స్నేహితుల మిద్దర మొకసారి గవ్వలాడినాము. వాడు నన్ను మోసముచేసి నా దగ్గరదంతయు గెలుచుకొన్నాడు. నేను కోపము పట్టజాలక మొలలో నున్న కత్తితో వానిని పొడిచినాను. పోటు డొక్కలో గట్టిగా తగిలినది. డబ్బు చేతపుచ్చుకొని నేను యింటికి పోయినాను" అని కత్తితో మనుష్యుని పొడిచి చంపుట తప్పులేని యొక మామూలు వ్యాపారములాగున కోడినో కుక్కనో చంపినటుల చెప్పివేసి "తరువాత నొకసారి బ్రాంది తీసినానని యజమాని నన్నుకొట్టినాడు. నాకు తాగుట యలవాటుమాత్రము లేదు. ఇంతే సంగతి" అనుచు మెల్లగా వెలుపలకు పోయినాడు.

"ఆహా! హత్య వాని యంతరాత్మను బాధించుచున్న

టుల కనుపించదు. అన లిట్టివాని కట్టిదొకటి యుండదనుకొని యెదను" అనుకున్నాడు కృష్ణుడు.

ఒక గంట గడచిపోయినది. కృష్ణుడు కునికిపాట్లు పడ సాగినాడు. ఇక కనిపెట్టుకొని కూరుచుండుట కష్టసాధ్యమని యును, యనవసరమనియు నతడనుకొను నంతలో వసారలో నొక క్రీనీడ కనుపించినది. కృష్ణుడు తృళ్ళిపడి లేచునంతలో బూసిగాడు కంటపడినాడు.

"నాయురును, మరియొకడును కలసి వెళ్ళుచున్నారు యెక్కడికో" అని మామూలుమాటగా చెప్పి యాదిక్కునకు చూపించినాడు.

కృష్ణు డావైపునకు దీక్షగా చూచినాడు. పశువులసాల ప్రక్కను, నాయురు దొంకవెనుకకు గెంతి వెళ్ళుట వాని కంట పడినది. వానిదగ్గర పెద్దమూట యొకటున్నది. అతడు తొంద రగా పోవుచున్నటుల కనుపించినది.

"చాలమంది వచ్చినారు. నాయుకు నిన్న మంటచేసినా డు. పెద్దమంట. వాడు మంటదగ్గరగా వచారు చేసినాడు" అని తాజుగా చెప్పసాగినాడు బూసిగాడు.

కృష్ణుడొక తృళ్ళిపాటుతో లేచి నిలచినాడు. తనవరకు వచ్చినప్పుడుగాని బూసిగాని బుర్ర చురుకుగా పనిచేయదు. ఇప్పుడతడు సంగతులన్నియు కనిపెట్టి, చూచినాడు. కాని వా టినన్నిటిని జతపరచి, పర్యవసానము సూత్రము గ్రహించలేక

పోయినాడు. గ్రహించ ప్రయత్నించను కూడను. స్వవిషయ మునతప్ప మిగతవాటిలో వానిది కప్పతలకాయయే.

"ఏమి? నిన్నరాత్రి వారిని పిలుచుటకు గుసుకుగనా నాయరు మంటవేసినది?" అని సూత్రముగా గద్దించి యడిగి నాడు కృష్ణుడు.

"ఆ" అని బూసిగా డంగీకారసూచకముగా తలయూపి "సూర్యాస్తమయ మగుముందు ఒకటి, రెండు, మూడుసార్లు కూడ చేసినాడు మంట. పసరు వస్తువు వేసినకొలదిని పొగ దట్ట ముగా వెలువడి మాడకులేచునుకదా!" అన్నాడు.

కృష్ణు డిక నందులోని మంచిచెడ్డలు విచారణచేయుట కాగలేదు. అత డంతవరకు కనిపెట్టిన నాయరు చర్యలన్నియు నొక్క సారిగా, వాడు మరియొకరితో కలసి కుట్రచేయుచు న్నా డన్న సంగతిని ధృవపరచినవి. అందు సందేహామొంతమా త్రము లేదు. అతడు చంగునలేచి నిలచినాడు.

"నడు! నడు! త్వరగా. ఊ. అయ్యగారిని యందరను లేపు. త్వరగా. పరుగు" అని మందముగా కదలప్రయత్నించు చున్న నా బుద్ధిమంతుడు వసారగట్టుక్రింద వడులాగున తన్ని నాడు. వాడు లేచి, రెడ్డియు రామచంద్రమును పండుకొనిన చోటకు పరుగునపోయినాడు. ఈలోపున కృష్ణుడు వసారాపొడు వునను నడచి, వంటసాల వైపునకు పోయినాడు. అక్కడ గంట వంటి పెద్ద యినుపముక్క యొకటి వ్రేల్లాడగట్టి యున్నది. ఇం టివారెవ్వడయిన నా చేసువపాలములలో పనిచేయుట తటస్థిం

చినప్పుడది వారిని వేళకు భోజనమునకు పిలుచుట కేర్పడినది. అతడు దాని నుత్తి పుచ్చుకొని, చెవులు గింగురులెత్తునటులు, చుట్టుప్రక్కల జీవరాసి యంతయు నిదురలేచునటుల సత్తువ కొలదిని, యినుపముక్క మీద దెబ్బమీద దెబ్బగా కొట్ట సాగినాడు.

వానికి పొగ కనుపించినది. చిన్నపోగులాగున తయారు చేసిన తడిగడ్డిమీద స్వల్పముగా మంట కనుపించుచున్నది. అక్కడనుండి తమాషగా పేర్చిన యెండుకర్రల వరుస, చేరువ నున్న కర్రలకును, యింటికిని కలసి యున్నది. ఈ యంతమీ దను కిరసనాయిలు చిలకరించి యున్నది. వంటవాని యుదా రత్వ మిప్పుడు వెల్లడి యయినది. అతడు చివరనున్న గడ్డికి నిప్పంటించినాడుకదా! అది నెమ్మదిగా రాజి, మండి, యంటు కొని, క్రమముగా చిన్నకర్రలమీదినుండి ప్రాకి యింటికంటు కొనును. కిరసనాయిలు చిలుకరించి యుండుటచేత నందు పొర పాటెంతమాత్ర ముండదు. ఇ దంతియు ప్రారంభమున కాక నతడు కొంతదూరము పోయినతరువాత జరుగగలదు. ఇల్లం తయు కర్రపనియే కనుక రెండు నిమిషములలో నొక్కసారిగా యంటుకొని భగ్గుమని పోవును.

కాని కృష్ణుడు సంగతంతయు ప్రారంభావస్థలోనే కని పెట్టుటచేత, నక్కడకు తొందరగా పరుగెత్తుకొనిపోయి యం టుకున్న గడ్డి యొక్క తన్నుతన్ని దూరముగా చెదరకొట్టినా డు. ఒక కర్రతో మరియు దూరముగా గెంటివేసినాడు. అంత

లో రామచంద్రమును, ధనరాజును వెంటపెట్టుకొని రెడ్డి యకృడకు వచ్చినాడు.

"కృష్ణా! సంగతేమనలు?" అని వగర్చుచు నడిగినాడు రెడ్డి.

"నాకు సరిగా తెలియదు కాని, రాత్రి నాయరు గురుతుగా మంటవేసినాడనియును, చాలమంది మనుష్యులు వచ్చినారనియును బూసిగా డనుచున్నాడు. కాని నాయరు యిల్లు తగులవేయుటకు కావలసిన యేర్పాటులుచేసి, యెవరినోకలసికొనుటకు కాబోవును పోయినాడు. నా కిదంతేయు......"

రామచంద్ర మధ్యవచ్చి "అవును. దీనికి మూల మూయేకాక్షియును, వాని యనుచరులును. నాయరు వారితో చేరినాడనిన యంగాశ్చర్య మేమున్నది!" అన్నాడు.

"రత్నములు" అని రెడ్డి పద్ద కేకవేసి "అగ్గిబాబుమీవకత్తు తీర్చుకొనుటకై వాడు వారి నందరను మనమీదకు తీసికొనివచ్చినాడు. ధనరాజు! మనవారి నందరను పిలువుము. ఇల్లార్పుకొనుచుండు మనల నాకస్మికముగా చుట్టవేయవలయునని వా రభిప్రాయపడి యుందురు" అన్నాడు.

రెడ్డి తనయింటనున్న తుపాకులు, పిస్తోలు సిద్ధముచేసి మందు, తూటాలు వగయిరా వెలపలకు తీసినాడు. అది మన్యపుపరిదేశ మగుటచేత నత డట్టి యేర్పాటుల కలవాటుపడియున్నాడు ఈలోపున కృష్ణుడు చురుకుగా వసారాస్తంభముమీదనుంది యింటికప్పుమీదకు ప్రాకి కూచుమన్నాడు. అతడక్క

డనుండి చుట్టుప్రక్క లెక్కువ బాగుగాచూడ వీలుగనుండును.

అత డక్కడ యెక్కువకాలము కనిపెట్టుకొని యుండ నవసరము లేకపోయినది. అసూయాపూరితుడై కత్తుతీర్చుకొన గోరిన యొక తుంటరి, మైలుదూరముపోయి మిగత తుంటరులను తీసికొనివచ్చుట కంత యెక్కువకాల మవసరముండదు కదా! కృష్ణుడు యింటి కప్పుమీదకు పోయి సరిగా సరుదుకొని కూర్చుండునంతలో సుమారు పదిమంది మనుష్యు లచ్చటకు వచ్చుచుండుట వానికి కనుపించినది.

క్రింద చేరువనున్న రామచంద్రముతో "ఎనమండుగ్గురు" అని నెమ్మదిగా నని, కృష్ణుడు "నాయరుకూడ వెంటనున్నాడు వారికి. వారు చెదరి యిల్లు చుట్టవేయుదు రనుకొనియెదను. అందొక డిటు వచ్చుచున్నాడు మనవైపునకు. వాడొక కర్రిచివర తెల్లగుడ్డకట్టి మీదకెత్తి పట్టుకున్నాడు. అది రాజీప్రయత్నము కాబోలును" అన్నాడు.

రాము డీసంగతులు మిగతవారి కందించినాడు. రెడ్డి పిస్తోలు చేతపట్టి మీదకుపోయి, యా వచ్చినవానిని దానితో పట్టియుంచినాడు. వచ్చినవాని ముఖము యానవాలు లేకుండ మునుగుమాటున దాగియున్నది.

వాడు సుమారు నూరుగజములు దూరమువరకు సమీపించునంతలో రెడ్డి "ఆ! ఆగు మక్కడనే! నీ వెవరవు? నీకు కావలసిన దేమి?" అని ధిక్కరించి యడిగినాడు.

"మీదగ్గర కొన్ని రత్నము లున్నవట. మీ రవి మా

కిచ్చివేసినయెడల మీకు మే మే విధమైన హానియు కలుగచే యకుండ వెడలిపోవుదుము." అని సమాధానము వచ్చినది. ముసుగులోపలినుండి, మాటలాడినవాడు మాత్రము చాల తెలివితేటలు గా, మారుగొంతుతో మాటలాడినటుల నంతసించినాడు.

"నాయనా! ఇతడే జోగు లను నతడు. నాకు బాగుగా తెలియును." అన్నాడు కృష్ణుడు.

రెడ్డి వికటముగా మందహాసము చేయుచు "జోగులూ! నీవు వెనుకకు యేకాకిదగ్గరకు దయచేసి, మా దగ్గరనుండి తుపాకిదెబ్బలు తప్ప నితరమేదియు లభించదనిచెప్పుము వానికి. నీకు రెండునిమిషములు వ్యవధిమాత్ర మిచ్చుచున్నాను. తరువాత తుపాకులు పేలుటయు మీరు చచ్చుటయు జరుగగలదు" అన్నాడు కచ్చితముగా.

"అయ్యా! మీకు నక్కడకున్నంత యవకాశమయినను లేదు. మేము చాలమంది యున్నాము. తెగించి యున్నాము. దేనికయినను వెనుతీయము. అటకాక నా రత్నములయినను మీవికావు. మాకంతవరకు తెలియును. కావున నవి మాకిచ్చివేయుము. మేము వెంటనే యీ ప్రాంతములు విడచి పోవుదుము, కనుక మీ క్షేమమాదము నుండదు. మీరు బుద్ధికలిగి వర్తించకపోయిన మిమ్ముల నందరను పిచ్చికుక్కలను చంపినటుల తరిమి తరిమి చంపి, యీ రాళ్లేకాక మాకు దొరకిన మిగతసామాను కూడ తీసికొనిపోవుదుము. తెలిసినదా? నే

నింతవరకు చెప్పవలసిన యగత్యము లేదు కాని, చెప్పిన బాగుం డునని చెప్పుచున్నాను. ఏ పద్ధతి బాగుండునో మీరే యాలో చించుకొనుడు త్వరలో" అన్నాడు.

"నీకు నా సమాధాన మిదివరకే యిచ్చినది. పీలుగను న్నప్పుడే జాగ్రత్తపడు. ఊం. పరుగెత్తు. రెండునిమిషము లయి పోవచ్చినవి ఆ! అదిగో! ప్రారంభమగుచున్నది." అన్నాడు రెడ్డి కచ్చితముగా.

జోగులు వెనుకకుతిరిగి మిగతవారు నిలచియున్న చెట్టు క్రిందకు పరుగు ప్రారంభించినాడు. రెడ్డి చెప్పినప్రకార మంత వరకాగి రెండు నిమిషములు ముగియగనే, పిస్తోలు మీద కెత్తి నాడు.

"కృష్ణా! నీవు క్రిందకు దిగి నీ పడకగది కిటికీలో కా యుము. రాముడును నీవును కలసి యావైపు కాపుండుడు. మందుగుండు సామాను మాత్ర మనవసరముగా కర్చుపెట్టకుడు. మనదగ్గర నున్న సరుకు తక్కువ ప్రస్తుతము" అన్నాడు.

కృష్ణుడు నెమ్మదిగా క్రిందకు దిగజారినాడు. అంతలో పిస్తోలు చప్పుడు, దూరమున చెట్టుక్రిందనున్న గుంపులో ప్రవేశించినది. ఒకడు గిరుననతిరిగి, డొక్క చేతపట్టుకుని ప్రక్క నున్న చెట్టుచాటునకు పారిపోయినాడు. మిగతవారు కూడ వాని ననుసరించినారు. క్షణకాలము నిశ్శబ్దము. తిరిగి చప్పుడ యినది. ఒక గుండు వచ్చి చూరునకు తగిలి రెడ్డి నిలచియున్న చోట దగ్గరగా పడినది. రెడ్డి దానికి సమాధానముగా పిస్తోలు

పేల్చి తాను మరుగుపడునటుల వెంటనే యొక స్తంభముప్రక్క నక్కినాడు. ఎదురుగా నిలచిన మాటదక్కదని వానికి బాగుగా తెలియును.

ప్రతికక్షులు చెట్లమరుగున కదలుచుండుట వానికి బాగుగా కనపించుచున్నది. వారిలో యిరువురు కుడివైపునకు తొందరంగా పరుగెత్తినారు. మరి యిరువురు యెడమవైపునకు పరుగెత్తినారు. రెడ్డి వారివైపు దృష్టినిలిపి మరియొకసారి పేల్చినాడు. ఈసారి పూర్తిగా మాటదక్కినది. ఏమన రెండవజంటలో నొకడు గిర్రున తిరిగి, మొద్దులాగున నిలువున క్రిందపడినాడు. గుండు వానికి తొడలో దూరినటుల స్పష్టమాయినది.

కాని రెడ్డియున్న ప్రదేశము గురితించుటకై ప్రతికక్షులు మరియొక చప్పుడుకొరకు కనిపెట్టి చూచుచున్నారు. రెడ్డి రెండవసారి పేల్చియు పేల్చునంతలో దానికి సమాధానముగా డొంకలో తుపాకి పేలినది. అది గురితప్పి రెడ్డితలను విడచిపెట్టినది కాని వాని కుడిముంజేతిని పోచీదగ్గరనుండి మోకచేతివరకు చీల్చివేసినది. పెద్దమూలుగుతో రెడ్డి యచ్చటనుండి క్రిందకు దిగజారిపోయినాడు. ధనరాజు వానిని పట్టుకొని రక్తము స్రవించకుండ నాపుటకు గుడ్డ బిగియకట్టి వానిని నెమ్మదిగా లోపల చేర్చినాడు.

రెడ్డి నిరుత్సాహస్వరమున "ధనరాజు! నేను నేటి కిక పిస్తోలుపయోగించజాలను. నీ వీ పిస్తోలు పుచ్చుకొని యక్కడ కాపుందుము. నీవును కుద్రహాంద్రుడును జాగ్రత్తగా మెలకువ

గా మెలగవలయును. ఆ తుచ్ఛ లింట చొరబడకుండ చేసినంత సేపును యే భయమునులేదు." అని నీరసముగా ముగించి మంచము మీాద వాలిపోయినాడు.

ధనరాజు రెడ్డి సంరక్షణ తన భార్యమీాద పెట్టి తాను ముందునకు పరుగెత్తినాడు.

అతడు తొందరగా "అబ్దుల్ నీవు క్షణ కాల మిచ్చట నుండుము. జాగ్రత్త" అని హెచ్చరించి, తాను కృష్ణుడును, రాముడును కిటికీ ప్రక్కను నక్కి కాపుకాయుచున్న గదిదగ్గరకు పోయినాడు.

చెప్పమరచితిమి. "అబ్దుల్" అను నత డప్పటికొకటి రెండురోజులకు పూర్వ మక్కడకు వచ్చి వారిదగ్గర జీతమునకు కుదిరిన యొక యువకుడు. సుమారు యిరువదిరెండు సంవత్సరముల వయసువాడు. మంచి కండపుష్టికలవాడు. చురుకైనవాడు. సాహసౌదార్యముకలవాడు. అవసరమునకు పనికివచ్చులాగున కనుపించినాడు.

ధనరాజు రామకృష్ణులను సమీాపించి "కృష్ణా! మీానాయనకు దెబ్బతగిలినది. అంత ప్రమాదకరమయినది కాదు కాని తుపాకి పట్టుటకుమాత్రము వీలుతప్పిపోయినది. ఇక్కడ నీ వొక్కడవే పనిచేయవలయును. రామా! నీవు రెండవవైపునకు పొమ్ము. నేను ముందువైపుననిలచి చుట్టును తిరిగి చూచుచుందును. అగ్గిబాబువెంటపోయినవాడు త్వరలో తిరిగి వచ్చిన బాగుండును." అన్నాడు.

"వారు ప్రొద్దుటగాని తిరిగిబయలు దేర రసలు" అని కృష్ణుడని "కాని బూసిగాడేడీ? మనము వానిని సహాయముతో సము పంపవచ్చు ననుకున్నాను. కబు రందిన నగ్గిబాబు మనకు సహాయపడగలడు ప్రస్తుతావస్థలో" అన్నాను.

"బూసిగాడా? చాలగొప్పవాడు. మంచివానినే వెతికి నావు. వాడు మొదట కంగారుగా మనకు సంగతిచెప్పి, తుపాకిచప్పుడు వినపడగనే యే డొంకలోనో దూరియుండును. ఎక్కడనో దాగొనియుండు వానిని నమ్ముకొనిన లాభమే మి? మనము స్వయముగా తంటాలుపడవలసినదే కాని వానివలన ప్రయోజన ముండదు." అన్నాడు ధనరాజు విసువుగా.

అతడు తొందరగా వెలుపలకు పరుగెత్తుకొనిపోయి, జేబు నిండ పిస్తోలు తూటాలువేసి, ముందునున్న చెట్లలో యే మాత్రముకదలిక కలిగినను కొట్టుటకు సిద్ధముగా వసారలో జోర్లపరుండి చూడసాగినాడు.

పరిస్థితులు చాల మొండిరూపు దాల్చినవి. కేవలము గాలి 'బంగళా'గా మట్టిమెత్తిన తడకలతో తయారయిన యొక చిన్నయింటి నిరువురు చిన్నవాండ్రను యిరువురు పెద్ద వాండ్రను సంరక్షించవలసివచ్చినది. తుపాకులతో దండయాత్ర.

చుట్టుపక్కల పొలములలో పనిచేయువారెవరయిన నున్నచో వారు తుపాకి చప్పుడు విని సహాయార్థము వచ్చుట

కవకాశ మున్నది కాని సాహసించియెవరు వచ్చెదరు. అట్టివాడొకడు ప్రతికక్షుల తుపాకిదెబ్బలకు జడిసి వీరిసహాయార్థము రాక వెలుపలసహాయముకొరకు ప్రయత్నించినను వానికధమ మక్కడకు యిరువదిమైళ్ళలోపున తగినసహాయము దొరకదు. గూడె మంతకన్న దూరము. అగ్గిబాబును, వాని యనుచరులును సహాయము చేయగలిగినంత చేరువలో నున్నమాట వాస్తవమే కాని వారి కసలు సంగతి తెలియుటెట్లు!

ధనరాజు నిరుత్సాహముగా "వారికి కబురుచెప్పవారేరీ యనలు! మనపాట్లు మనము పడవలసినదే కాని యదంత సులువుగా కనుపించుటలేదు." అని లోలోన తలపోయసాగినాడు.

మరికొంతసేపటివరకు ప్రతికక్షుల యలకడ కనుపించలేదు. అంతలో నించుకంతయును సవ్వడి లేకనే యాడొంకలోనుండి యొక్కసారిగా తుపాకులచప్పుడు బయలుదేరినది. గుండ్లు వసారాలోను, కప్పుమీదను, పడినవి. కొన్ని తడకల గోడలలోనుండి లోపలకు దూరినవి. ఒకటి ధనరాజు బుగ్గకు దూసికొనిపోయి యక్కడ యెర్రని చారిక పడినది. అతడు చీకటిలో కనుపించుటలేదు. సుమారుగా కొట్టిన దెబ్బయయినను నరిగనే తగిలినది. కొంత పనిచేసినది.

అంతట చెట్లక్రిందనున్నవారినుంచి నలుగురు విడిపోయి యింటివైపునకు పరుగిడి రా సాగినారు. అక్కడనుండి మాత్రము తుపాకులు యధావిధిగనే పేలుచున్నవి. ధనరా

జు పిస్తోలుమెత్తి కొట్టినాడు. పరుగున వచ్చుచున్న నలుగురిలో ముందువాడు గిరుక్కునతిరిగి హఠాత్తుగా కూరుచున్నాడు. మిగత ముగ్గురును పొగబయలు దేరినచోటు గురుతించి కొట్టుటకై యక్కడ చాలసేపు పాగి కొట్టప్రారంభించినారు. కాని ధనరాజు మాత్రము కొట్టినతక్షణ మాచోటువిడచి ప్రక్కకు పోవుటచే, ప్రతికక్షు లక్కడకు విడచిన గుండ్లన్నియు నిష్ప్రయోజనమైనవి. ధనరాజు మరియొకసారి కొట్టినాడు. ఒకని నెత్తిమీద తలగుడ్డ తూలి క్రిందపడినది.

"చాల యెత్తయిపోయినది, ఈ సారి" అని మరియొక సారి కొట్టినాడు. అది చాల క్రిందయి ముందునకు వచ్చువారి కాలిదగ్గర పడినది.

కాని యంతవరకు చాలును. వా రింకను ముందునకు సుమారు నూరు గజములు రావలసియున్నది. అప్పటికిగాని యిల్లు సమీపించజాలరు. అది కాక చేత పిస్తోలుపట్టుకొని వసారా కప్పుచివర కూరుచున్న వాని కుందునన్నియవకాశము లుండవు దూరముననున్న వారికి. అందుచే వారు ముగ్గు రొక సారిగా ముందునకు వంగి క్రిందపడినవారి వానిని మోసికొని వెనుకకు పారిపోయినారు.

"దెబ్బతగిలినదా!" అని ధనరాజు భార్య వానినడిగి న దాత్రముగా ప్రక్కకిటికీలోనుంచి.

"లేదు తగలదు కూడను. తగిలిన నీకే తగల గలదు. పో! లోపలకు త్వరగా" అని బిగ్గరగా నరచి "ఓయి! నీవు!

మీరును, పిల్లవాండ్రును జాగ్రత్తగా కండ్లు తెరచుకొని మరి కూర్చుండుడు. వారేమి చేసినను చేయగలరు. జాగ్రత్త." అని హెచ్చరించినాడు.

కొంచెముసేపు నిశ్శబ్దము. ధనరాజున్నవైపున డొంకలో నేవిధమైన చలనమును లేదు.

"ఆహా! అక్కడ నెవరును కనుపించరు. మరియొక వైపునకుపోయి యుందురు." అనుకొన్నాడు.

"ధనరాజు! వారేదియో చేయుచున్నటులున్నది. ఈ వైపున పొగవచ్చుచున్నది." అన్నాడు కృష్ణుడు.

ధనరాజొకసారి మెలకువగా నలుప్రక్కలు చూచి, నెమ్మదిగా వసారా దిగి కృష్ణుడున్న గదిలోనికి పోయి, జాగ్రత్తగా లేచి, కిటికీలోనుండి వెలుపలకు తొంగి చూచినాడు.

గాలి మందముగా బయలుదేరినది. దానితోపాటు పొగకూడ యింటివైపునకు రా సాగినది.

"వారి రాక మనకు తెలియకుండ నుండుటకై చేసిన ప్రయత్నమిది. పొగగుండవచ్చుట కేవలము పిరికిపందల పని. ఏమందువు? అది రెండువిధములుగా పనికివచ్చును. నేను వెలుపలకుపోయి పొగదట్టముగా బయలుదేరినతరువాత ముందునకు పరుగెత్తెదను. నేనుపిస్తోలుకూడ పేల్చుదును-అవసరమునుబట్టి. అందుచేత నే నని స్థిరపడువరకును మీరు మీ పని మానవలదు. దానికానవాలు" అనుచు నతడు గదిలో నలుప్రక్కలచూచి "ఇదిగో ఆనవాలు" అని పలికి యతడొక

తెల్లని తలగడ గలేబు తీసి తలకు తగిలించుకొని బిగియకట్టి "ఇవిగో! ఇక మీరు పొరపడుట కవకాశముండదు. జాగ్రత్త. నేను వారికన్న దొంగపన్నికకు సిద్ధపడుచున్నాను" అన్నాడు.

ఈ మాటలు ముగియునప్పటికి పొగదట్టముగా బయలుదేరి యింటివైపు తుట్టలు తుట్టలుగా వచ్చుచున్నది. ధనరాజు తొందరగా బయలుదేరి ముడిచిపెట్టుకొని కులాసగా పరుండియున్న రెడ్డిదగ్గరకు పోయినాడు.

రెడ్డి సీరసముగా "నాకిప్పుడే సులువుగా నుండగలదు. నేను......" అనుచున్నాడు.

అంతలో ధనరాజు వానిమాట కడ్డువచ్చి "అయ్యా! మరియొక తుపాకి యున్నదికదా!" అనుచు మూలనున్న తుపాకి తీసి రెడ్డి చేతికిచ్చి "అయ్యా! మీరిక్కడ నీ కిటికీ దగ్గరనే కూర్చుని యెవరయిన నిటువచ్చిన కొట్టుడు. కొంచె మోపికపట్టి, తుపాకి కిటికీ కాన్చి, మీట యెడమచేతితో నొక్కిన చాలును పనిజరుగుటకు. నే నిక్కడనుండి యొకసారి వెలుపలకు పోవలసిన పనియున్నది. నా నెత్తిమీదనున్న తెలుపును పట్టి నన్ను మీరు సులువుగా గురుతించకలరు." అనుచు నతడు తొందరగా వెలుపలకు పోయినాడు.

రెడ్డి కిటికీదగ్గర సిద్ధముగా వంపుకున్నాడు. పొగ క్రమ క్రమముగా ముదిరి, తుట్టలు తుట్టలుగా బయలుదేరి యింటిచుట్టును కమ్ముకొనినది.

అంతయు నిశ్శబ్దము. చాలనిమిషములు గడచినవి. ప్రతికక్షుల కదలికగాని, చప్పుడుగాని వినుపించుటలేదు. తరువాత క్రీనీడ యొకటి దూరమున కదిలి, వంగి, రహస్యముగా చురుకుగా ముందునకు ప్రాక నారంభించినది.

రెడ్డి తలయెత్తి వానినెత్తిమీద తెలుపులేదని స్థిరపరచుకొని, జాగ్రత్తగా గురిచూచి తుపాకి పేల్చినాడు. ఆవ్యక్తి పూర్తిగా సాగి, నిలచి యొక పెద్దమూలుగుతో వెనుకకు తిరిగి యరచుచు పారిపోయినది. అంతలో కేకలు, చప్పట్లు ధనరాజు పిస్తోలుదెబ్బలు, వాని ఘర్జనలు హఠాత్తుగా వినుపించినవి.

"పేల్చవలదు! నేను" అని ధనరా జరచి చీకటిలో తొందరగా పరుగెత్తుకొని వచ్చి యింట ప్రవేశించినాడు. తలకు కట్టిన తెలుపుగుడ్డ పోయినది. పొడుగైన యరచారిక యొకటి భుజమున కనుపించినది. అది కత్తిపోటు. ముఖము మహాతీవ్రముగా నున్నది.

అతను హెచ్చరికగా "మరియొకనిని పడకొట్టినాను. ఒకడు దెబ్బతిని పారిపోయినాడు. వారి వెనుకవైపునుండి తిరిగివచ్చినాను. వారు చెదరిపోయినారు. కాని......" అనునంతలో,

ఢాం! ఢాం! కృష్ణుడు పేల్చినాడు. ధనరాజు కంగారుగా ముందునకు పరుగెత్తినాడు. కిటికీలో నెవరో కూరుచున్నటుల కనుపించినది. ధనరాజు పిస్తోలులోని యాఖరుతూటా

వెలుపలవడినది. కిటికీలోనున్న వ్యక్తి యొక్క పెద్దయర పరచి వెలుపలకు గెంతి పరుగిడినది. కృష్ణుడు దాని వెనుక భాగలో నికి మరియొకసారి పేల్చినాడు. దానితో ముట్టడి తేలి పోయినది.

మరియొకసారి నిర్మలత, నిశ్శబ్దము. పొగ నెమ్మదిగా పలుచబడి, యంతరించినది. కలహాప్రదేశము స్పష్టముగా కనపించినది. ఇంటికిని చెట్లకును మధ్య చావునకు సిద్ధముగా నున్న వ్యక్తి యొకటి పడియున్నది. కృష్ణుడు కూరుచున్న కిటికీ కమ్మిమీద రక్తము కారినది.

"నేను కొట్టినది వానినే. అంతవరకు నాకు గట్టినమ్మకమే. నేను వెలుపలకు పోయినప్పుడు నా మీాద కలియపడినాడు. ఈ గాయము వాని కత్తిదే. త్వరలో కట్టు కట్టక పోయిన కొంతవరకు పనికిరాదు. చాల బాధగానున్నదికూడను. చేయి మీాదకు లేవతీయజాలను." అన్నాడు ధనరాజు.

"కాని—కాని-వా రిక వెడలిపోరా? మనము చాల నష్టము కలుగచేసినామే వారికి?" అన్నాడు కృష్ణుడు.

"అలాగే, వారు కూడ మనకు చాల నష్టము కలుగచేసినారు కాని వారిది మనకన్న నెక్కువ. నే నివ్వుడు, అర మనుష్యుడనే. పిస్తోలుతో ప్రయోజనములేదు. మీా నాయనగారు కూడ కొన్ని వారముల వరకు పనికిరారు. ప్రతికక్షులు చీకటి పడువరకు నెక్కడేని దాగియుండి తరువాత దొరకు నవకాశము

ను చిక్కపట్టుకొందురు. మీలో నెవరయిన నవతలకు పోయి నహాయము తీసికొని వచ్చిన బాగుండును. కృష్ణా! నాకు చాల దాహముగా నున్నది. కొంచెము నీరు—త్రాగుటకు” అన్నాడు ధనరాజు.

“అంతకన్ననా” అని కృష్ణుడు పిస్తోలు క్రిందపెట్టి వసారా చివరకు పోయి యక్కడ నొక మూల కూరుచున్న యబ్దుల్ను చూచి “అబ్దుల్! ఏమయిన క్రొత్తసమాచారము?” అని ప్రశ్నించినాడు.

“ఏమియు కనుపించదు. అక్కడ నేమి జరుగుచున్నది? వారిలో నెవరయిన చిక్కినారా?” అని యబ్దులాత్రముగా ప్రశ్నించినాడు.

“ధనరాజొకనిని చంపి, యిరువురను గట్టిగా గాయపరచినాడు. కాని అతనికికూడ దెబ్బతగిలినది పాపము. చాల దాహముగా నున్నదట” అని సమాధానము చెప్పి యతడు తొందరగా, పరుగిడి వసారలో నొక మూలనున్న కుజ్జాయిమూర త్రిప్పినాడు. కాని నీరు రాలేదు. ఉస్సుమని యూరకున్నది.

♦ ♦ ♦

## ౧౨

"నీరు వచ్చుటలేదు. మరి పాడయిపోయినట్లున్నది" అన్నాడు కృష్ణుడు.

"పాడయిపోవుటయేమి? సాయంత్రమునకు కావలసినంత బాగుగా నున్నది. నేను నీరు తీసినాను కూడను" అన్నాడు అబ్దుల్.

"చూచి వచ్చెదను వెళ్ళి" అని కృష్ణుడు పరుగున పోయి చూచివచ్చి "ఆహా! మంచిసంగతే. గొంప మునిగినది. మరి పాడయి యున్నది. ఆ కోతిముండకొడుకు వెళ్ళిపోవుచు చేసిన పని యిది" అన్నాడు కృష్ణుడు.

ఇరువురు తెల్లపోయి యొకరి మొఖ మొకరు చూచుకున్నారు. అది నేలనూయి. రెడ్డి వచ్చినప్పుడే యీ ప్రాంతములలో నీరు దొరకుట కష్టమని యొకటి "బోరింగు" చేయించినాడు. మరి పాడువడిన నీరు కాశీలోయుండును. చేరువలో లభించదు.

"వాగులో దొరకు ననుకొనియెదను" అన్నాడు అబ్దుల్.

"అంతమాత్రము తెలియకపోలేదు. కాని వెలుపలకు పోయిన గుండుదెబ్బలు తినవలసివచ్చును. అదెవరు తిందురు" అని కృష్ణుడు గొణిగినాడు.

"అవసరమువచ్చిన నే నే తిందును" అని తటపటా

యించి "ఆహా! మీా నాయనగారి గదిలో కూజాతో నీరుండు
ను. తప్పక" అని అబ్దుల్ జ్ఞాపకము చేసినాడు.

"అవును. అవును." అని యొకవెర్రికేక వేసి కృష్ణుడు
తొందరగా పరుగెత్తి నిరుత్సాహముగా తిరిగివచ్చి, "అందు
లో కిరసనాయిలు కలిపి యున్నది. వాసనచూడు. ఇది కూడ
నా తుంటరిముండకొడుకు పనే. వాడు కంటపడిన శరీరము
తూట్లుపడునటుల నా పిస్తోలుతో......" అనసాగినాడు.

"చాల తమాషగా నున్నది. నా కింతవరకు దాహము
లేదు. గాని యిప్పుడు నీరు దొరకదని తెలిసి దాహము వేయు
చున్నది" అన్నాడు అబ్దుల్.

"సరే! నీవు పోయి కిటికీదగ్గర జాగ్రత్తగా కాపుండు
ము యెప్పటిలాగున. నే నీ చచ్చుకబురు మనవారికి జేరవేసె
దను" అన్నాడు కృష్ణుడు.

అతడు పోయి సంగతి చెప్పినాడు. ధనరాజు నిస్పృహ
గా తల వాలవేసినాడు. గాయమునుండి చాల రక్తము స్రవిం
చియుండుటచే దాహము మిక్కుటముగా నున్నది. అతడు
కృష్ణుని కిటికీదగ్గర కాపుంచి రెడ్డి దగ్గరకు పోయినాడు.

"అయ్యా! మనము చిక్కులో పడిపోయినాము. ఆ
తుంటరి—మళయాళపువాడు నీటిమార్గ విరుగగొట్టి, ఇంటిలోని

నిలువనీరు పాడుచేసి మరి పోయినాడు. దాహము తీరుట కాధారము లేదు" అన్నాడు.

రెడ్డి యూపిరి తీసికొని తన మంచముదగ్గర నగము వరకు నీటితోనున్న మరచెంబు చూపించినాడు.

"అది కొంతవరకు పనిచేయును. ఇరువురు ముగ్గురకు కర్తవ్యములు గడుపును—కొంతవరకు. కాని మిగత......"

"దానికేమియు నాధారము కనుపించదు. మనలో నెవరయినపోయి మధ్యమార్గమున నుండు నగ్గిబాబును, వారిని, పిలుచుకొని వచ్చిన తప్ప నేను వెళ్ళియుందును కాని..." అని యనసాగినాడు ధనరాజు.

"ఆహా! ధనరాజూ! నీవు ప్రయాణము చేయకలిగిన స్థితిలో లేవు.' చాల మెలకువగా జారి, డొంకలలోదూరి, లేడిలాగున పరుగెత్తి ప్రక్కదారుల పోవలయునే కాని, తీరుబడిగా గుర్రముమీద పోవుటకు వీలులేదుకదా! కృష్ణుని పంపుదునులే. వాడు తగినవాడే ప్రస్తుతావస్థకు" అన్నాడు రెడ్డి.

తరువాత 'నేను వెళ్ళుదును,' 'నేను వెళ్ళుదును' అని రామచంద్రుడును, కృష్ణుడును, అబ్దులును తగవులాడినారు. అబ్దులు మంచి పెంకితలకాయ యగుటయేకాక మిగతవారికన్న కొంచె మెక్కువ కండపుష్టికలవాడు. వాని చురుకుతన

మును, తెలివితేటలును, యతడచ్చటకు వచ్చిన త్వరలోనే వారికి నచ్చినందున వానినే పంపుటకు స్థిరపడినది.

పగలు చురుకుగా గడచిపోసాగినది. ఎండ మరియు మరియు ముదురుచున్నది. నాలుకలారిపోయినవి. గొంతుకలార్చుకొని పోవుచున్నవి. అయినను మిగతవారందరును ఉన్న స్వల్పనీరెక్కువదాహమయి యవసరావస్థలోనున్న రెడ్డికిని ధనరాజునకును విడచి తమ రందులోని దొరకసీటిబొట్టయినను ముట్టుకొనకూడదని పట్టుపెట్టుకుని యెంతయిన బాధపడినారు. ఉన్న కొలది నీరును రోగులకు ప్రీత్యప్రాయముగా—గుక్కెడు గుక్కెడుగానిచ్చుచువచ్చినారు.

వారి కడుపుమంట వృద్ధియగుటకు పశువులశాల కవలనున్న నీటివాగు వారి కనుతుణమును యెండలో మెరయుచూ కనుపించుచునేయున్నది. అంతకన్న బాధ యేమన ప్రతికత్తు అందులోని నీరు రెండు మూడుసారులు 'బాల్చిల'తో తెచ్చుకొనియానందించుట వారికి కనుపించినది. ఎంత పనికిరాని వాగులోని నిలువనీరైనను కక్కుర్తికి మంచిదే కదా!

కృష్ణుడు వారి నప్పుడే తుపాకితో కొట్టెదనన్నాడు కాని దూరదృష్టికల రెడ్డి వాదించినాడు. తూటాలు చాలినన్ని లేవు. చీకటిపడినతరువాత వాటి యవసర మెక్కువ యుండవచ్చును. వారు మరియొకసారి తప్పక ముట్టడించెదరు

అంత వసారాలో తిరుగుచున్న రాముడు "అయిన మన మింతవరకు నీయింట మిగిలియుండుట యెందులకు! అవతలకు పోకూడదా యిల్లువిడచి? 'ఎంతటివారినైన కొన్ని గంటలవరకు ధిక్కరించి నిలువకలదు మనయినుపపెట్టె" అని మీరు చాలసారు లన్నారగదా! అందులోని రత్నములు చేతపట్టుకొని మన మందర మవతలకు పోవుదము. ఏకాక్షి వానిప్రయోజకత్వ మొకసారి దానిపై ప్రయోగించి చూడ కలదు" అన్నాడు

"ఆలాగే కాని నేనును ధనర జును ఒక్కయడుగయిన కదలలేము. ఎవరయిన నొక్కరు దాటిపోవచ్చును. చిన్న మోసముచేసి. ఇదిగో నీతాళము మీదగ్గరనుంచు యవసరమువచ్చిన—మూడు త్రిప్పులు కుడికి. ఒకటి యెడమకు, ఒకటి కుడికి. నా కేదయిన నధమము సంభవించిన—అంతవరకు రాదుకాని—వనికివచ్చుచు. జ్ఞాపకముంచుకొనుడు." అన్నాడతడు. కుర్రవాండ్రవయివు చూచి తాళమందించినాడు.

  

# ౧౩

నెమ్మదిగా సూర్యాస్తమయ మయినది. అబ్దుల్ ప్రయాణమునకు సిద్ధముగా నున్నాడు. రెడ్డి సలహా ప్రకారము రాముడును, కృష్ణుడును కొంత యెండుగడ్డియును, కొన్ని పాత గుడ్డలును కిరసనాయిలులో తడిపి సిద్ధపరచి యుంచినారు.

"ఇది యీ వైపున వెలిగించిన, వారీమంట యేమియో తెలియక గుడ్లు తెరచుకొని యందరీ వైపునకే వచ్చెదరు. అప్పుడు మనవాడు సురక్షితముగా వెలుపలకు దాటిపోవచ్చును. సిద్ధముగా నున్నావా అబ్దుల్" అని ధనరాజు హెచ్చరించినాడు.

"ఆహా! సర్వసిద్ధముగా" అని యతడు సమాధానము చెప్పి ముందునకు వచ్చినాడు.

"అతడావరణదాటినచో యావల డొంకలచాటున పడును గనుక తప్పించుకొని పోయినటులనే. మాట దక్కిన దన్నమాటయే. కాని ప్రారంభావస్థయే యెక్కువ ప్రమాదకరమయినది.'

చీకటి ముదిరినది. అబ్దుల్ కృష్ణుడందించిన పిస్తోలు పుచ్చుకొని మెడదగ్గర కమీజు తెలుపు కనుపించకుండ కోటు మెడ తిరుగవేసి కొన్నాడు.

అతడు నెమ్మదిగా "ఆ ప్రక్క మంటచేయుటకు సిద్ధముగా నుండుడు. ప్రస్తుత మందరదగ్గర సెలవు. తిరుగ సూ

ర్యోదయము కాకపూర్వమే మిమ్ము కలసికొనగలను యీశ్వ రానుగ్రహమున్న" అన్నాడు.

అతడు నెమ్మదిగా వసారా వాటి క్రిందకు దిగి తల నేలకు తగులులాగునవంగి యావరణదగ్గరకు ప్రాకినాడు. రామచంద్ర మప్పటి కప్పుడే కిరసనాయిలు సరుకును నిప్పుపెట్టి, రెండవవై పున నింటికి దూరముగా, చీకటిలోనికి, సత్తువకొలది విసరినా డు. అది క్షణంకాలము పొగచూరి, ఒక్కసారిగా పెద్దవెలుతు రుతో భగ్గుమని మండినది

దూరమున 'ఢాం' అని చప్పుడయినది. వెలుతురు చీక టిలో మెరసినది. ఒక గుండు మంటమీదనుండి దూసికొనిపో యి, యింటిగోడలో దూరినది. మరి రెండువైపులనుండి రెండు గుండ్లు యీలాగుననే వచ్చినవి. ఇరుపార్శ్వములనుండి పెద్ద కేకలును, చప్పట్లును వినిపించినవి. మంట కొలదికాలము తీరుబడిగ మండి చల్లారినది. క్షణకాలము నిశ్శబ్దము. తరు వాత ఒక బుల్ పోయినదిశగా చీకటిలోనుండి పిస్తోలు చప్పుడు రెండుసాగులు వినుపించినది. అంతయు నిశ్శబ్దము.

"అది మన పిస్తోలుచప్పుడు. అబ్దులు చేతిలోనిది. దాని ధ్వని నాకానవాలే" అని రామచంద్రుడు మెల్లగా నన్నాడు.

అబ్దులు సంగ తేమయినది. అతడు తికమకలు గడచి, సురక్షితముగా సాపుదారిని బడితినని సంతోషించి, యేదియు కనుపించుటను వినుపించుటయు లేనందున ముందునకు చురుకుగా సాగిపోవుచున్నాడు. అంతలో మంటవెనుక పిస్తోలు

చప్పుడు వినపించినది. "ఆ మంట వారిని పూర్తిగా మోసగించినది" అనుకొనుచు నతడు తొందరగా ముందునకు పోవుచున్నాడు. కాని ముందుప్రక్క డొంకలో నేదియో కదలినటుల ననుమానించి హఠాత్తుగా నాగినాడు.

వాని పిస్తోలు చంగున మీదకు లేచినది. ఒక గుర గుర ఒక గొంతు. చీకటిలో నెవరో వానిమీద పడుటకు ప్రయత్నించుట-అతడు మెలకుగా చంగున గెంతి ప్రక్కకు తప్పుకున్నాడు. పిస్తోలు పేల్చినాడు. వానిమీద కెగిరిన వ్యక్తియొక్క మూలుగుతో క్రిందపడినది. కంగారులో పిస్తోలుదెబ్బ స్వల్పముగా గురితప్పి వాని తొడలలో తగిలినది. పొడుగుపాటి కత్తియొకటి వాని ప్రక్కను నేలమీద పడి వాని సముద్దేశమును వ్యక్తపరచుచున్నది. అబ్దు లక్క డాగలేదు. వానిని చూడలేదు. అతను సాగిలపడియున్న యీ కళేబరము మీదనుండి దాటి, తొందరగా ముందునకు పోసాగినాడు. వాని పిస్తోలు చప్పుడు విని ప్రతికక్షులు వానివెంట పడుదురని వానికి బాగుగా తెలియును. అదియును గాక ప్రతికక్షులు వానివెంట కాలినడకను గాక గుఱ్ఱముమీద వచ్చిన మరియు చిక్కు. చిక్కేమి! కొంప మునిగిపోవును. కార్యము గంగకలిసి పోవును.

వగర్చుచు, ముందువెనుక చూడకుండగనే యడ్డువచ్చిన రాళ్ళను తుప్పలును దాటుచు నతడు గమనము తగ్గించకుండగనే సుమారు రెండు మూడు మైళ్ళదూరము పోయినతరువాత యూపిరి యాడనందున కొంచెము నెమ్మదిగా నడువ ప్రారం

భించినాడు. పిస్తోలులోని కాళీగుల్లలు తీసి వేసి జేబులోని కొత్త తూటాలు తగిలించినాడు.

మళయాళవువానిని కొట్టుట వాని యభిప్రాయముకాదు. కాని విధియె వానిని తీసికొనివచ్చి మనయబ్దుల్ కాళ్ళ కడ్డుగా పడ వేసినందునకు మాత్ర మతడు సంతసించినాడు వాడు దయచూపవలసిన రకములోనివాడు కాదు. వారిచేతులలో నంత యాదరణపొంది వాడు చూపిన ప్రతిఫలము, కృతఘ్నత—శ్లాఘ్యములు—దొంగలతో నయిక్యమయి తిన్న యింటి చూరునకు కొరకంచు పెట్టి యూదుచున్నాడు.

"తగిన ప్రతిఫలము" అనుకొనుచు నతడు తిరిగి పరుగు ప్రారంభించినాడు. అత డిప్పుడు సముద్రప్రదేశమున పరుగిడుచున్నాడు. వానికి ముందుగ కొంచెము దూరమున నొక నీటిగుంట యున్నటుల వానికి జ్ఞాపకము. అత డక్కడ నీరు త్రాగి క్షణకాలము సేద దేరి మరియుమిక్కిలి వడిగా పరుగెత్త వచ్చుననిన యూహా వాని కానందము కలిగించినది. అంతలో వాని వెనుక సమీపముననే బాటవెంట గంభీరమైన చప్పు డొకటి వానికి వినుపించినది. ఎవరో వానివెంట పడినారని యును వారు త్వరలోనే వానిని కలసికొనగలరనియు నతనికి స్థిరపడినది.

"వాడు యేకాక్షి యయినపక్షమున చాలచిక్కు. వానికి ప్రాంతములు చాలబాగుగా తెలియును." అనుకొని పరుగు హెచ్చించి "వాడుకాకపోయిన......నొకవేళ. ఆ... ఎందుకయినను మంచిది త్వరగా పరుగిడుట" అనుకున్నాడు.

అతడిప్పుడు నీటిగుంట సమీపించినాడు. అక్కడ నేల విశాలముగా నున్నది. నక్షత్రముల వెలుతురు స్వల్పముగా నున్నది వెనుకవచ్చువానికి ముందున్నవానిని చూపించుటకు చాలును.

వెనుకనుంచి యొకపెద్దకేక వినవచ్చినది. అనుమానించినట్టుల నతడు వెనుకవాని కంట పడినాడు. ముందునకు పరుగెత్తుటకు కాళ్ళాడినవికావు వెనుకవాడు వాయువేగమున వచ్చుచున్నాడు. అబ్దుల్ కాళ్ళక్రింద నేల మృదువుగా కనుపించినది. అతడిప్పుడు రెండుప్రక్కల నగాధమైన బురదయును మధ్య గట్టిగాను యున్న యొక కాలిబాటగుండ పోవుచున్నటుల తెలిసికొన్నాడు. అది క్రొత్తవానికి చాల ప్రమాద ప్రదేశము. ఏలనన పొరపాటున ప్రక్కకుపడిన యొక తప్పటడుగు వెనుకవచ్చు వానిని వాని గుర్రము నా బురదలో నూరత్రొక్క గలదు. ఆ యవకాశమును పోనీయకూడదు— అబ్దుల్.

రౌతు వెనుక తీవ్రముగా వచ్చుచున్నాడు. 'అబ్దుల్' తొందరగా పరుగిడుచున్నాడు. వెనుకవాడు చాలవరకు సమీపించుచున్నాడు. అతడు బురదసంబంధమయిన ప్రమాదమును తరిలో గ్రహించి జాగ్రత్తపడునో! అట్టిదేదియు జరుగ నవకాశ ము లేకుండచేయుట కబుల్ వెనుకకు తిరిగి పిస్తోలు పేల్చినాడు. అది వెనుక వచ్చుచున్న వానికి తగులునని కాదు. వాని కుద్రేకము కలుగచేసి, వాడు తగు జాగ్రత్తలో నుండకుండ చేయుగలదు. అ దాలాగునే జరిగినది. వాడు తీవ్ర

ముగా నొక్క కేక వేసి ,గుర్రమును అదలించి ప్రక్కలో నొకపోటు పొడిచినాడు. గుర్రము రాతుకన్న కొంచెము తెలివికలదగుటచే కంగారుపడి ముందునకు పరుగిడక యాగినది. కాని రాతు రెండవసారి మరియు తీవ్రముగా పొడచుటచేత కండ్లుమూసికొని చంగున ముందునకు గంతినది.

ఒక్క గంతు! ఒక్కయరవు. తరువాతగుర్రమును రాతును చుట్టపెట్టుకొని యొక్కసారిగా బురదలో పడిన చప్పుడు. సురక్షితముగా మిగిలిన యబ్దుల్ వెనుకకు తిరిగియస్పష్టముగా నున్న వెలుతురు సహాయమున బురదలో గింజుకొను చున్న గుర్రమును చూచినాడు. వానికి కావలసిన పని జరిగినది. తంటాలుపడి గట్టునకు వచ్చి వచ్చినతోవనే వెనుకకు తిరుగును కాని యాతుంటరిరాతు వాని నిక ముందునకు తరుమజాలడు. కావలసినంత సంతుష్టిగా నబ్దుల్ ముందునకు పోయి, నీరు నమిూపించి తృప్తి తీరతాగి సేద తేరి తిరిగి ముందునకు పరుగుప్రారంభించినాడు.

అతడు తరువాత పోవలసినదియు పోవుచున్నదియు దిగువల్లము. ప్రయాణము తేలికగా నున్నది. అత డాలాగున చాల దూరము పోయినతరువాత గుర్రములును బాటప్రక్కను నదును ప్రదేశమున, నిదురపోవుచున్న మనుష్యులును వానికి కనుపించినారు. అంద రొక్కసారిగా త్రుళ్లిపడి లేచినారు. అబ్దుల్ రెండుమాటలలో నగ్గిబాబునకు సంగ తా మూలాంతము విశదపరచినాడు. ఇట్టి పరిస్థితుల కలవాటుపడిన యగ్గిబాబు, వాని పరివారము నొక్కక్షణములో సిద్ధపరచుటలో యా

శ్వర్య మేమున్నది. రెడ్డి పనివాండ్రుగాక యగ్గిబాబు పరివా
ర మరదజనునకు తక్కువలేదు. వా రిట్టి వ్యాపారములలో
బాగుగ నారితేరినవా రని వేర చెప్పనక్కరలేదు. తగువులాట
మాట చెవిని పడగనే వారికి శరీరములు పులకరించినవి.
అందరదగ్గర నాయుధము లున్నవి.

"అయితే నాయను వాని యాట ప్రారంభించినాడన్న
మాట? మళయాళపువానిని చచ్చినను నమ్మకూడదని నా ధ
ర్మసూత్రము. నామీాద కత్తు యుకొనియెదనిది? ఏమి! చావ
కొట్టితి నంటివికాదు నీవు వచ్చునప్పుడు. వాని నేమి చేసినను
పాపములేదు. నీవు చాల శ్రమపడినావు నాయనా. ఇక్కడనే
నిలచి కొంచెము విశ్రమించుము. మేముపోవుదము. నీ యవసర
మంతగా నుండదక్కడ మేముపోయినతరువాత" అన్నాడు
అగ్గిబాబు.

"చచ్చువిశ్రాంతి. అదంత దిక్కుమాలినదయిన దాని
నా ప్రతికక్షుల నాశ్రయించనే పంపుదము. నే నీగుఱ్ఱములలో
నొకటి తీసికొనియెదను. మీారుకూడ నొకదానిమీాద వచ్చిన
బాగుండును. అవి యంత మంచిరకపువికావు కాని......"

"నాయనా! ఈ చచ్చురకపు నరుకు నే నెక్కలేను.
ఈ గుర్రము నాలుగుకాళ్ళకన్న నా రెండుకాళ్లే నా కెక్కువ
విశ్వాసపాత్రములయినవి. పద. రండు. అందరును". అన్నా
డు అగ్గిబాబు గంభీరముగా.ఒక్కసారిగా మారిపోయినాడు.
ఉద్రేకము ద్రేకించినది.

  

అబ్దుల్ పిస్తోలుచప్పు డంతరించిన తరువాత యింటి చుట్టును క్షణకాల మంతయు నిశ్శబ్దము. వెంటనే గుర్రపు డెక్కల చప్పుడు వినుపించినది. వాని మనుష్యున కేమి హాని మూడునో యని రామచంద్రము కంగారుపడ సాగినాడు.

ధనరాజు తీవ్రముగా "నాయనా! వానిని గూర్చి నీ వంత కంగారు పడనక్కరలేదు. అతడు సామాన్యుడుకాడు. ఆ చచ్చులకు దొరకు రకములోనివాడు కాదు. నీవు చెవులు మాత్రము నిక్కపెట్టుకుని... ....." అనుచు నతడాకస్మికముగా వెనుకకు తిరిగి, యక్కడ కిటికీలో కూర్చునియున్న యొక యస్పష్టపు వ్యక్తిని యెడమచేతితో పిస్తోలుపట్టి కొట్టినాడు కాని దెబ్బ దాటిపోయినది. వెంటనే యొక తుపాకి పేలి ధనరాజు కాళ్ళలో పట్టుకొనినది. అతడు తూలి కూలపడి మరి యొకదెబ్బ కొట్టినాడు. మరి సమాధానము లేదు. కాని కృష్ణుడు కాపున్న వంటశాల దగ్గరనుంచి హఠాత్తుగా పేలిన తుపాకి చప్పుడు, అరపులు, చేగొడ్డలితో కొట్టిన రెండు దెబ్బలు వినవచ్చినవి. తరువాత నంతయు నిశ్శబ్దము.

కృష్ణుడు దూరమునుండి చాల యుత్సాహముగా "రామం! నేను నిదురపోవుచున్నా ననుకున్నాడు వాడు. వెర్రి వెంకాయి" అన్నాడు.

మరియొక క్షణకాలము నిశ్శబ్దము. తరువాత దూర

మున నెవరో పెద్దచప్పుడు చేసినారు. చాల చప్పట్లు సమాధానము వచ్చినవి. తరువాత నిటునుండియు, నిటునుండియు కేకలు వినుపించినవి.

ధనరాజు నీరసముగా "వాడేదియో యేర్పాటుచేయుచున్నటు లున్నది. త్వరగా చేసికొనిన బాగుండును పాపము, లేకపోయిన వెలుతురు రాగల దింతలో. అబ్దులాలక్ష్యము చేయకూడదను" అన్నాడు.

"ఆ వెంటపడిన గుఱ్ఱము వాని నాటంకపరచక పోయిన మాట" అన్నాడు రెడ్డి.

"అదెంతమాత్రము జరిగియుండదు." అన్నాడు ధనరాజు కచ్చితముగాను. వానికోరిక యది.

వానికి తెలియక పోయినను యతడు చెప్పినది వాస్తవమే. బురదలో పడినవాడు చచ్చుమొగము వేసికొని వెనుకకు వచ్చినాడు. ఋణము క్రీతము ప్రతిశత్రుల మధ్య బయలుదేరిన యీ యల్లరంతయు నదే. వాడు బయటపడి, చెదరిపోయిన గుఱ్ఱమును తరిమిపట్టుకొని యింటికి వచ్చునప్పటి కా వేళ యయినది. ఇప్పుడు యేకాక్షి గాని చీవాట్లు భరించుచున్నాడు.

కాని తుంటరిసంఘమునకు నాయకుడయిన యేకాక్షి సామాన్యుడు కాడు. మంచికి పనికి రాకపోయినను వానిబుర్ర యిట్టి సమయముల మంచి పనిచేయగలదు. అబ్దుల్ తప్పించుకొని పోవుట యన నేమొ వానికి త్వరలో గ్రాహ్యమయినది,

[illegible]రు [illegible]టలలో కావలసినంత సహాయము [illegible]గలదు వెల్లు[illegible]ంతవరకు వారికి కలిగిన నష్ట మత ను ప్రారం[illegible]సిన దానికన్న చాల యెక్కువ య యినది. అతడు [illegible] తన పరివారమును పోగుచేసి క్లుప్తము గను, [illegible]గను మాటలాడినాడు. అవసరమయిన యూలో [illegible]

ఇట్లా మూలాంతరము గస్తీ తిరుగుచున్న రామచంద్రము నకు దూరమున డొంకలలో నేదియో మినుకు మినుకు మనినటు ల, నొక నెరును ప్రక్కకు పోయినటులను కనుపించినది. ప్రతి కక్షులలో నెవరో చుట్టవెలిగించి యిటునటు తిరుగుచున్నటు లభిప్రాయపడినాడు రామచంద్రుడు, తరువాత నది కదలుట మాని యొకచోట నిలచి తీవ్రముగా రాజినటుల కనుపించినది. చుట్ట నోట పెట్టుకొని యూదినటు లున్నది.

అత డది కొన్ని నిమిషములు చూచి యూరకొనక నొక తెలివి తక్కువ——కాదు పొరపాటుపని——చేసినాడు. అత డు కిటికీలోనుంచి వెలుపలకు దిగజారి నేలకువంగి, నిప్పురగులు చున్న డొంక దగ్గరకు ప్రాకి పోయినాడు. తగినంత దగ్గరగా పోయి తుపాకి పేల్చవలయునని వాని యభిలాష.

అత డాలాగున నడచి సుమారు రేబది గజముల సమీప మువరకు పోయి తుపాకియెత్తి వెలుతురునకు రెండుమూ డం గుళముల మీదకు గురిచూచి కొట్టి వేటనే యది మోసమని గ్రహించినాడు. ఏలనన నా వెలుతు రటునిటు యూడి క్రిందపడి

క్షణములో నారిపోయినది. అది కొయ్యలకు వ్రేళ్ళాడదీసి నివ్వారగుల్కొల్పిన యొక యెండు బెరడు ముక్క.

అతడు వెనుకకు తిరిగి, ఘాయువచ్చినను విడచి యుండకూడని వాని స్థలమునకు పరుగున పోయినాడు. అప్పటికి వాని కింటిలో నొక తీవ్రమయిన కేక, ధనరాజు పిస్తోలుధ్వని, రెండు తుపాకి దెబ్బలు, కేకలు, తరువాత నుత్సాహపూరితమైన నొక పెద్ద వికారపు నవ్వు వినవచ్చినవి. ఆతుంటరు లింట ప్రవేశించినారు. ఆక్రమించినారు. స్వాధీనపరచుకున్నారు.

రామునకు మతిపోయినది. అత డప్పుడయినను ప్రక్కను దాగియుండిన కొంత యుపయోగకరమైన పని చేయగలిగియుండును. దానికి మారుగా వెఱ్ఱివాని లాగున నత డదివరకు వెలుపలకు వచ్చిన కిటికీమీదకు కండ్లు మూసికొని దుమికినాడు. అంతతో లోపలనుండి బలమైన చేతులు రెండు వాని మీద పడినవి. ఒక గుద్దు దౌడమీద తగిలినది. మరియొక క్షణములో వానికేదియు తెలియదు.

అయినను వానికి త్వరలోనే స్మృతి కలిగినది. అతడు గదిలో క్రిందపడి యున్నటుల గ్రహించినాడు. సన్నని దీపము వెలుగుచున్నది. ఏకాక్షి వానిని చూచి సగర్వముగా నవ్వినాడు. రక్తపు మరకలతో నిండిన గుడ్డల కట్టులున్న మఱియిరువురు తుంటరులు, యజమాని కెందును తీసిపోనివారు చేతులలో నాయుధములు పట్టుకొని గుమ్మమునకు చెరియొక ప్రక్కను సిద్ధముగా నిలుచున్నారు.

అంత యేకాక్షి తీవ్రముగా "ఇదిగో! మీ రాముని బంధించినాము. మీరు కూడ త్వరలో లొంగిపోండు. లేదా యికడిక ముందు యెప్పటికిని నడవ వీలులేకుండ చేయుదుము. తెలిసినదా? కీళ్ళు వనల కొట్టుదుము. ఒక నిముష మవకాశ మిచ్చుచున్నాను. త్వరలో నాలోచించుకొనుడు" అన్నాడు లోపలనున్న ధనరాజు వగైరాలతో. ధనరాజు "రామం! అత డనునది నిజమేనా? నా మాట వినుపించుచున్నదా నీకు?" అని బిగ్గరగా నరచి ప్రశ్నించినాడు.

"ఊ సమాధానము చెప్పు త్వరగా! వృధపుచ్చుటకు మాకు వేళచాలదు." అని యేకాక్షి రాముని గద్దించి కాలితో తన్నినాడు.

"నిజమే. వారు నన్ను బంధించినారిక్కడ." అని రాముడు సమాధానము చెప్పినాడు.

ధనరాజు కష్టముగా మూలిగి, రెడ్డికేదియో మెల్లగా చెప్పినాడు.

"సరే. మేము లొంగిపోవుదము. దీపము వెలిగించుచున్నాను."

లోపలినుండి తలుపు విడినది. దీపవు వెలుతురు వెలుపలకు చొరబడినది. ధనరాజు క్రిందపడి యున్నాడు. రెడ్డి మంచము మీద నున్నాడు. వారి యాయుధములు దూరమున పడి యున్నవి. ఏకాక్షి దిగ్విజయముచు వెళ్ళడించుచు, సగర్వ

ముగా నడుగులిడుచు, లోపలికి వచ్చినాడు. వాని వెంట వాని యనుచరుడు మరియొక డున్నాడు.

అతడు రుసరుస లాడుచు "మీరు మా కెక్కడలేని చిక్కులను తెచ్చిపెట్టినారు. మరి యొకరయిన దీనికి మిమ్ములనేమి చేసినను చేసియుందురు. మే మట్టివారము కాము. తెలిసినదా? తరువాత నీ వగ్గిబాబుదగ్గర పుచ్చుకొన్న రత్నములు మా కిచ్చివేయు మిప్పుడే. మే మీ క్షణముననే యీ ప్రాంతము విడిచి పోవుదుము. లేని యెడల—ఊఁ. త్వరగా" అని గద్దించినాడు రెడ్డిని చూచి.

అంత రెడ్డి తాజుగా "నీవు చాల శ్రమపడి వచ్చినావు. ఇయవలసినదే. కాని యారత్నములు యినుపపెట్టిలో నున్నవి. దాని తాళము మా కురత్రివాండ్రదగ్గర నున్నదను కొనియెదను. మా వా డొక డగ్గిబాబు కోసము వెళ్లినాడు. వా రిప్పుడే యొకటి రెండు నిమిషములలో రాగలరు. ఇంకను వేళమించ లేదు. కావలసినంత సావకాశమున్నది" అని సమాధానము చెప్పినాడు.

ఏకాక్షి మండి పడినాడు. పిస్తోలు తీసినాడు. దాని గొట్టము క్షణకాలము రెడ్డిచెవిలో నానించినాడు. అంతసేపు నా తుంటరి బొటకన వ్రేలు దాని కమానుమీ నాని యున్నది. తరువాత నతడు నవ్వినాడు। వికృతముగా.

"అయ్యా! నీ కిది మంచి క్షౌరము. నిన్ను చంపవలసిన

చ్చుయవసరముండదు. నీ మీదకన్న నీ పిస్తోలు బాగా రా యినుపపెట్టె మీద ప్రయోగించుట మంచిది” అన్నాడు ఏకాకి.

అతడు యినుపపెట్టె దగ్గరకుపోయి పిస్తోలు గొట్టము దాని తాళపుకన్నమునకు చేర్చి పేల్చినాడు. బ్రహ్మాండ మయిన చప్పుడయినది. సీసపుగుండు ముక్కలు కొన్ని చెదరి గదిలో నలుప్రక్కల పడినవి. ఆ ధ్వనికి దీప మారిపోయినది. గాలికి పక్కగదిలో నిలువునను పడియున్న రాముని ప్రక్క దీపము కూడా నారిపోయినది. వానికవకాశము దొరికినది

అంతవరకు వాని నావహించియున్న దిమ్మొక్కసారిగా నంతరించినది. అతడు చంగున లేచి కిటికీలోనుంచి వెలుపల పడినాడు. “ఢాం,, అని పేలిన తుపాకిగుండు వాని చెవిదగ్గరగా దూసికొనిపోయినది. అతడు విశాలప్రదేశమున పడి పత్తువకొలది పరుగిడుచున్నాడు. మరియొకటి పేలినది. మరియొకటి. రెండు గుండ్లును వానిప్రక్కనుండి పోయినవి. అతడు దూరమున డొంకలచాటున పడినాడు.

కాని యా తుపాకి చప్పుళ్ళకు సమాధాన మన్నట్లు దూరమున మరియొక చప్పుడు వినుపించినది. ఒకగుర్రపురౌతు వాయువేగమున నచ్చట నవతరించినాడు. సహాయము వచ్చె ననుకొనిన వైపున కాపుంచిన వానికేదియో వినుపించి యుండును. అతడు బిగ్గరగా నరచుచు నక్కడకు తొందరగా పరుగెత్తుకొని వచ్చినాడు.

"త్వరగా! త్వరగా. పారిపొండు. చాలామంది వచ్చు చున్నారు సహాయము. పూర్తిచేసి పొండు. త్వరగా! త్వరగా! పరుగు" అని తొందరచేసి నాడతడు.

ఏకాక్షి వసారాలోనికి వచ్చి, యందరను సిద్ధముగా నుండుమనియు, చేతికి దొరికినది సంగ్రహించుమనియు, నాజ్ఞా పించుచు చిందులు త్రొక్కసాగినాడు. కేక లతిశయించి నవి. వానియాజ్ఞలు శిరసావహించ బడినటుల స్థిరపర చుకొని యేకాక్షి తిరిగి గదిలోనికిపోయి దీపము వెలిగించి పిస్తోలు మరియొకసారి యినుపపెట్టితాళము కన్నమునకు చేర్చి పేల్చినాడు. కాని ఫలిత మిదివరకులాగుననే యయి నది. కన్నము యంచులు నలిగిపోయినవి. కన్నము సీసముతో నిండిపోయినది. అతడు కడుపుమంట యాపుకొనజాలక, పిస్తోలుమడిమ విసరుకొనుచు సాగిలపడియున్న రెడ్డి దగ్గరకు పోయినాడు తీవ్రముగా.

అతడు ధుమధుమలాడుచు "నీ తల చెక్కలు కొట్ట వలెనని యున్నది. గుండకొట్టి......"

దూరమున చిన్న మెఱపులు కనుపించినవి. అరడజను తుపాకిగుండ్లు రుయ్యి, రుయ్యి మని వచ్చి, యింటిమీద నక్కడక్కడ పడినవి. సహాయము చురుకుగా సమీపించు చున్నటుల వెల్లడియయినది. గ్రామునిదగ్గర కావుండిన తుం

టరి గదిలోనికి పరుగిడి పోయి, తీవ్రముగా యేకాక్షి భుజము పట్టుకున్నాడు.

"ఇక చాలించుము. మనము త్వరలో పోవలయును" అని యరచి, గుంచి వానిని బలవంతముగా వెలుపలకు లాగినాడు.

వారు తొందరగా వెలుపలకు వచ్చి యక్కడనున్న మిగతవారిని కలసికొన్నారు.

"మనవారందరు వచ్చినారా!" అని యేకాక్షి బిగ్గరగా నడిగినాడు.

వారందరు పారిపోయినారు. మరి యయిదు నిమిషములలో నగ్గిబాబును వాని యనుచరులును యక్కడ ప్రవేసించినారు. ధనరాజు భార్య వారి నెదుర్కొనినది.

"మీరు చాల కంగారుపడియుందురు. ఎవరికిని ప్రాణహాని సంభవించలేదుకదా!" అని యగ్గిబా బాత్రముగా నడిగినాడు.

"లేదండి. అంతవరకు జరుగలేదు. అయ్యగారును మాయాయనయును మరియొకరును గట్టిగా దెబ్బలు తిని యక్కడ పడియున్నారు. పిల్లలిద్దరు నేలాగున నున్నారో తెలియదు. మీదగ్గరకు వచ్చినయతడు క్షేమముగా తిరిగివచ్చినాడా!" అని యడిగిన దామె.

"ఆహా! కావలసినంత క్షేమముగా. అత డిక్కడకు మాకన్న చాల ముందే వచ్చినాడే." అని సమాధానము చెప్పి యతడు "అబ్దుల్" అని బిగ్గరగా పిలచినాడు.

సమాధానము రాలేదు. వారికన్న ముందువచ్చిన అబ్దు లెక్కడను కనుపించలేదు. ఏమయినదియు తెలియదు. గాలిలో కలసి పోయినాడు.

క్రిందను పడియున్న ధనరాజు నెమ్మదిగా "అతడు చిన్నవాండ్రతో కలసియుండును లెండు. ఆ వివపు ముండకొడుకు మళయాళివు వాని జాడ కనుపించలేదుకదా?" అన్నాడు

"వాడు అబ్దుల్ పిస్తోలునకు ఫలహారమయినాడట. కాళ్లలో దెబ్బతగిలి పడిపోయినాడని యతడే చెప్పినాడు. మేము వచ్చిన త్రోవలో వానికొరకు చూచినాము కాని కనుపించలేదు. నడువ గలిగిన స్థితిలో కూడ లేడట. ఏమయినాడో తెలియదు. వాని స్నేహితులు తీసికొని పోయినారేమొ తెలియదు వాని కళేబరము. సరేదానికేమి. మీ గాయములు చూడనిండు." అన్నాడగ్గిబాబు.

ప్రాతఃకాలము సూర్యకాంతిలో పడినది. పూర్తిగా తెల్లవారినది. అగ్గిబాబు పరివారము వాగు దగ్గరకుపోయి నీరు తెచ్చినారు. పాడయిపోయిన నూతిమర బాగుచేసినారు. గాయములు కడిగి కట్లు కట్టుట యయిన తరువాత నందరు భోజనములుచేసి కులాసాగా కూరుచున్నారు. కుర్రివాండ్రి జాడ మాత్రిము కనుపించలేదు. అబ్దులు సంగతి కూడ నంతే.

  

## ౧౫

నియమిత స్థానము విడచి యేకాక్షికని వాని యను చరులకును జయము చేకూరుటకు సాధనము తా నయితిని కదా యని రామచంద్రుడు చాలవరకు దుఃఖించి పశ్చాత్తాపపడి నాడు. చేయి కాలిన తరువాత నాకుల కోసము వెతకిన నేమి లాభము. అత డప్పుడు చేయవలసిన దేమన నెటులయిన నా పొరపాటు కప్పుడు ప్రయత్న మేదయిన చేయవలయును. మంచి యుక్తి యొకటి పన్నవలసి యున్నది. ఏ మా యుక్తి?

కాపు రన్నాడు పారిపొమ్మని యేకాక్షిని తొందర చేసిన కేకలు వాని "ఏ మా యుక్తి"కి సమాధాన మొసగినవి. ప్రతికక్షు లిక కొన్ని నిమిషములలో పిక్కబలము చూపు దురు. వారు పోవునప్పుడు వెనుక కొంతవరకు స్పష్టమయిన గురుతులు విడచి పోవుదురు. తరువాత నదివరకులాగున రాళ్లలో నా గురుతులు క్రమముగా నశించిపోవును. అందు చేత నదివరకులాగుననే వారియునికిపట్టు వెతకి తెలిసికొనుట కష్టతరము, కావున రాము డిపుడు వారి ననుసరించి వీలుకలిగి నంత చేరువగాపోయి, వారియునికిపట్టు తెలిసికొనిన తరువాత వారిని మట్టుపెట్టుటకు మిగతవారిని తీసికొనిపోవుటకు వీలుగ నుండును. అతడాలాగు వారి ననుసరించి పోయిన తిరిగి వచ్చు టకొకటి రెండురోజులు పట్టును.

అందుకొరకు వానికి ముఖ్యముగా కావలసిన దాహా రము. అతడందులకు యింటివెనుక వైపుననున్న వంటవసారా లోనికి పోయినాడు. తొందరగా నాలుగుమూలల తడుముచు న్నాడు. లోపలదీపమారిపోయినది. వెలిగించుటకు వీలులేదు. వెలుతురు వెలుపలకు కనుపించి ప్రతికక్షులకు త్రోవచూపి ప్రమాదము తెచ్చిపెట్టునని యతడు చీకటిలోనే తడమసాగెను. అంతలో వెలుపల తొందరగ పరుగిడిన పదధ్వని వినుపించినది. ఆహారపదార్థములు సంపాదించకుండ వెలుపలకు పోవ సాహసించ లేకపోయినాడు. వానిప్రయాణము చాలాదినము లు పట్టవచ్చును. ఎన్నిదినములు పట్టునో యెవరు చెప్పగలరు? అతడొక చిన్నయలమారు తెరచి లోపలకుచేయిపోనిచ్చినాడు. అంతలో వెలుపలనున్న పదధ్వని యతడున్న వసారా దగ్గర గా వినుపించినది. వెంటనే వెలుపల తలుపు గొళ్లెము వేసిన చప్పుడు వినవచ్చినది.

అతడు బోనులో చిక్కుకొన్నాడు. అందునుండి వెలుపల పడుటకు మరియొక మార్గములేదు. అతని దగ్గర స్వ సంరక్షణ కాయుధ మంతకన్న లేదు. మూలనొక పొడుగయిన కర్రమాత్రమున్నది. అతడు దానికోసము చేయిచాపి యందు కొనునంతలో తలుపు నెమ్మదిగా విసినది. ఏదియో మెల్లగా లోపలకు జరిగి వచ్చునటుల చప్పుడు వినవచ్చినది.

“చేతు లెత్తుము. కదలితివా మెదడూడకొట్టుదును”

అని గంభీరమైన మాటలు వినవచ్చినవి. రామచంద్ర మురొహామగా నూపిరి తీసినాడు.

అతడు హెచ్చరికగా "నీవా! ఎవరో యనుకున్నాను. ధనరాజును మరియొకరును దెబ్బలు తిన్నారు కాని యంత ప్రమాదకరమైనవి కావు. నాయనగారికి కొంచెము కులాసగా నున్నదన్నమాట యేనా?" అని యడిగినాడు.

"ఆ! కాని నీ విక్కడ నేమి చేయుచున్నావు" అని రెండవయాత డడిగినాడు.

"నేను రహస్యముగా నా తుంటరుల వెంట పడుద మనుకొనుచున్నాను."

కృష్ణుడు కులాసగా "నేనును సరిగా నదే యనుకొనుచున్నాను. అందులకే యిక్కడకు వచ్చినాను. కాని నీ విక్కడ నేమి చేయుచున్నావు?" అన్నాడు.

"తోఁవబత్తెముకొరకు. తిండినిమిత్తము. ఒకటి రెండు కాలువలుకూడ నున్న మంచిదేకాదా! ఇక్కడనే యుందు మిప్పుడే వచ్చెదను." అనుచు రాముడు ధనరాజు గదిలోనికి పరుగెత్తినాడు.

అంతయు నిర్మలముగా నున్నది. అల్ల రేమియు లేదక్కడ. ఆ తుంటరులు బహుశా వచ్చిన యనలువని పూర్తి కావించుకొని తరువాత నిల్లంతయు తడిమి మంచిబట్టలును తినుబండారములును తీసికొనిపోవ తలచి యుందురు. అవును కాని యట్టి సావకాశము లభించలేదు. రాముడు తొందరగా నోధు

మపిండియు పంచదారయు మూటగట్టి, రెండు శాలువలు రెండు తాబేటికాయలు పట్టుకొని, కృష్ణునిదగ్గరకు పరుగు పరుగున వచ్చినాడు.

అతడు "తుపాకి యున్నది కాదూ నీ దగ్గర? అయిన నుపయోగ మేమి? ఆ గుంపుతో మనము దొమ్మిలాటకు దిగిన మాట దక్కదు. నడు ముందునకు. త్రోవలో వాగు దగ్గర కడుపునిండ నీరు త్రాగి, తాబేటికాయలు నీటితో నింపి తీసికొనిపోవుదము. మన మిక వృధపుచ్చుటకు వ్యవధి చాల దు. వారీ సరికి చాలదూరము పోయియుందురు." అన్నాడు.

వారు నడక సాగించి, వాగు దగ్గర నీరుత్రాగి, తాబేటి కాయలు నీటితో నింపి చంకల వేసికొని, యంతకు పూర్వము వారి విరోధులు వచ్చి, పోయిన త్రోవను పడి నడక సాగించి నారు. వారు చాలదూరము పోవునప్పటికి ముందు కొంత దూరములో మానవసముదాయ మొకటి పోవుచున్న సందడి వారి కా నిర్మల నిశ్శబ్దమున తీరుబడిగా వినవచ్చినది.

వారు చురుకుగా మరికొంత దూరము సాగి పోవునంత లో వెలుతురు మందముగా నలుప్రక్కల వ్యాపించుటచే ముందు చాలదూరమున గుంపుగా పోవుచున్న వారి ప్రతిక క్షులు ప్రత్యక్షముగా కనుపించినారు.

"ఆహా! అరుగో వారు." అని కృష్ణు డన్నాడు. వారు వెంటనే యొక రాతిప్రక్క దాగినారు. "మన మిక స్థిమితము గా పోవచ్చును. వారిని గూర్చి నీ యభిప్రాయ మేమి?" అని యతడు రాము నడిగినాడు.

చట్టధిక్కారము చేసిన యీ మానవసముదాయ మప్పు డొక సముద్రప్రదేశమున సాగిపోవుచున్నది. చిన్నవాండ్రు దీక్షగా చూచినారు క్షణకాలము.

"వా రిప్పుడు తొమ్మండ్రుగు రున్నారు. మొదట మనలను ముట్టడించినపు డొక డజనునకు తక్కువలేరు" అన్నాడు రాముడు.

"బాబయ్య యొకనిని కొట్టినారు. ధనరా జొకనిని కర్చుచేసినాడుకదా. మరియొక రిద్దరు ప్రమాదకరమైన గాయములు తిన్నారు. అదిగో చివరపోవుచున్న వానిని చూడు. కునికిపాట్లు పడుచు నడచుచున్నాడు. వెంటనున్నవారు వాని నీడ్చుకొని పోవుచున్నారు."

అవును వారికి గట్టిపనే జరిగినది. వా రిప్పుడు సముద్ర ప్రదేశమున నుండుట చాల చిక్కు. వారు మరుగుపడి పోవువరకును మనము ముందునకు పోవుటకు వీలులేదు" అన్నాడు రామచంద్రము.

"అవును. మన మీ ప్రక్కవడి పోవుదము కొంత దూరము. ఆ వైపున నొక దట్టమైన పొదవుచాటి గచ్చపొద యున్నది. మన మందు ప్రవేశించిన పక్షమున వారు వెనుకకుతిరిగి చూచినను ప్రమాదములేదు" అన్నాడు.

మరి రెండు నిమిషములలో మన మిత్రద్వయ మా పొదలలో పడి సాగిపోవుచున్నది. వా రా రీతిగా పొదలగుండ కొంతదూరము పోయి, తరువాత వెలుపలకు వచ్చి చూచు

నప్పటికి ముందుపోవు గుంపులోని చివరవా డప్పటి కొక చిన్న కొండయొక్క ముందుపల్లములోనికి దిగి యదృశ్యమగుట కనుపించినది.

ఆవేట-ముందు యేకాకి వగయిరాయును, వెనుక కుంద్రవాండును-కొంతసే పాలాగున సాగినది. ఏకాకియును వాని పరివారమును కుణకాల మొక నీటిగుంట దగ్గర నాగినారు. చిన్నవాంద్రు వెనుక నొక డొంకచాటున దాగినారు. ఆ తుంటరులు తిరిగి ప్రయాణము ప్రారంభించినారు. వారిని వేటాడుట కొక సంఘము సాధ్యమయినంత త్వరలోనే బయలుదేరునని యా తుంటరులకు పూర్తియయిన నమ్మక మున్నది. కాని యప్పటి కప్పుడే యొకటి చిన్నదయినను వెన్నంటి యున్నదని వారియల్ప దృష్టికి గోచరించలేదు. అ దప్పటి కంత సమీపములో నున్నటుల వారి కేసూత్ర మనుమానము తగిలియుండినను కుంద్రవాండ్రకు మంచి చురుకయిన మర్యాద జరిగియుండును. పిస్తోళ్లు చురుకుగా పనిచేసియుండును. కోయ ముండకొడుకు కోతిముండా కొడుకు గదా!

కాని యేవిధమైన యనుమానమును లేక నాశాభంగము నను వెలిబుచ్చు ముఖములతో నా గుంపు చురుకుగా ముందునకు సాగిపోవుచున్నది. మధ్యాహ్నము మీరునప్పటికి వారా కొండలమధ్య నొక లోతయిన లోయలో ప్రవేశించినారు. అదివరలో పోలీసువారు వెన్నంటి తరిమినపు డంతవరకు వచ్చిన

తరువాత నొకలోయగట్టున గుంపు హఠాత్తుగ నదృశ్యమయిన దనియును, వారు నిరాశ చేసికొని వెంటపడుట మానివేసి నట్టును, పోలీసు నబినస్పెక్టరది వరకు చెప్పిన ప్రదేశ మదియేనని యతడు చెప్పిన యానవాళ్ళను బట్టి కృష్ణుడును, రాముడును గ్రహించగలిగినారు.

"అంతయు నల్లరాయి. పలుచగ పరచియున్న నల్లయిసుక. జాడలు పడ వసలు. చచ్చినను దొరకలేదనిన యాశ్చర్యమేమున్నది.?" అన్నాడు కృష్ణుడు.

వారు లాగుననే మరికొంత దూరము పోయినతరువాత నా లోయ కుడిప్రక్కకు మలుపు తిరిగినది. వారొక పెద్దరాతి చుట్టు తిరిగి పోవునంతలో పెద్ద కేకలువినుపించి సరిగా సమయమునకు హెచ్చరిక కలిగించినవి. కృష్ణుడు వెంటనే రాతిప్రక్కను నక్కి ముందునకు జరిగి తొంగిచూచినాడు.

అక్కడకు సుమారు నూరుగజములకు ముందుననే యాగుంపు పాగినది ఏకాక్షియును మరియొకడును ముందునకు పోయి సాపుగానున్న యెత్తయిన నొకరాతిని బలము కొలది ముందునకు గెంటుచున్నట్లుల కనుపించినది. ఆ రాతి కడుగు భాగము దట్టమయిన నాచుతో కప్పబడి యున్నది. పయికి సాపుగా నిలువునలేచి యున్నది. వారు సత్తువ కొలది గెంటుచున్నారు దానిని.

అంతలో నాశ్చర్యార్థకమయిన సంగతొకటి తటస్థించినది. ఆరాయి కొంతసేపటికి వెనుకకు వాలి యొక నల్లనిగుహా

ముఖమును వెళ్ళడిపరచినది. ఆ గు ంపంతయు నందుదూరి య దృశ్యమయినది. వెంటనే యా వింతతలుపు చిన్నచప్పుడుతో ముందునకు పడి ద్వారమును మూసివేసినది. ఆగుంపు వారు— ఏకాక్షి యును, వాని యనుచరులును—రహస్యముగా నంత వరకు దాగియున్న ప్రదేశ మిప్పుడు వెళ్ళడి యయినది. సమస్య విడిపోయినది.

అప్పటి కక్కడ చేరి తలుపు మూసికొనిపోవుట స్పష్ట ముగా చూచిన రామచంద్రము "సరిగా నాయినస్పెక్టరు చెప్పిన టులుగనే యున్నది. ఏకాక్షిగాడు మంచి గుహాకనిపెట్టినాడు. కంటిలోని లోటు బుర్రలో సరిపుచ్చుకొన్నది. ప్రారంభమున లేకపోయినను తరువాత కష్టపడి సంపాదించియుండును. కాని యా తలు పేలాగున తయారయినదో!" అన్నాడు.

వారు క్షణకాల మాగి చాల జాగ్రత్తగా నడుగు లిడుచు ముందునకు సాగిపోయినారు. పూర్తిగా సమీపించినగాని నం గతి బోధపడినది కాదు. వారికాతలుపు కర్రతో తయారయి వేరుగనున్నప్పటికిని యొకటిగా కనుపించుటకుదాని యడుగు భాగ మొక చదునయిన రాతిమీద సరిగా నానుకొని దట్టమ యిన నాచుతో కప్పబడియుండుటయే కారణము.

వా రా తలుపు తీయుటకు ప్రయత్నించ లేదు. చూడ వలసినంతవరకు చూచినారు. ఆ తుంటరులు లోయలో దూరి జాగ్రత్తగానున్నారు. వారిని పట్టుకొనుటకు యింటి దగ్గరనుండి

కొందరను తీసికొని రావలయును. అందుచేత నెమ్మదిగా వెనుకకు పోయి దూరముననున్న నొకపెద్దరాయి—చిన్నకొండప్రక్క చేరినారు. అక్కడకాని యాప్రాంతమునకాని యేకాక్షి తాలూకు యెవరును కనిపెట్టి చూచుచుండుట లేదనియును, ఒకవేళ నెవడయిన కనిపెట్టిచూచినను వారలకు కనుపించ వీలులేదనియును తృప్తిపడి యొకచోట చెట్లచాటున, చెట్లక్రిందుగా మకాము యేర్పరుచు కున్నారు.

„ఏకాక్షి కొన్ని రోజులవరకును కదల డిక్కడనుంచి. కాని వాని నెంతత్వరలో చిక్కపట్టిన నంత మంచిది. వారి కవతల మరియొక మార్గమున్న కష్టమే. దానికేమి కాని మనము ముందు కొంచెము పుల్లలు పోగుచేయ వలయును. చీకటిపడిన వీలుండదు. త్వరలో మంటచేసి తినుటకేదయిన తయారు చేసికొన వలయును. కడుపుదహించుకొని పోవుచున్నది” అన్నాడు. కృష్ణుడు.

రాముని స్థితి యంతకు తక్కువగాలేదు. వారు క్రితము నాటి యుదయమున కాఫీతో తిన్న ఫలహారము తప్ప యింతవర కాహారమేదియు లేదు. అందుచేత రాముడు పంచదారయు గోధుమపిండియు కలిపి సిద్ధము చేసినాడు. కృష్ణు డెండు చితుకులును కర్రలును ప్రోగుచేసి చీకటిపడిన వెంటనే మంట చేసినా డొక దట్టమైన డొంకచాటున. మంటగాని వెలుతురుగాని వెలుపలకు కనుపించిన ప్రమాదముకదా! వారు ప్రతి శత్రులకు కనుపించు ప్రమాదము లేకుండ చేసికొనుట వారికి

ముఖ్యావసరము. వారు త్వరలో రొట్టెలు తయారు చేసి కొంతవరకు కడుపుబాధ తీర్చికొని యా చెట్లచాటున చలిగా లిలో దట్టమయిన శాలువలు కప్పుకొని యొకని కౌగిట నొక రు హాయిగా నిదురపోయినారు.

తెల్లవారగనే రాముని చేతితాకుడు కృష్ణుని నిద్రనుండి లేపినది.

అతడు నెమ్మదిగా "నే నదే యాలోచించుచున్నాను. దీనికి నొక వైపున మరియొక మార్గ ముండియుండును. మన వా రెవరయిన పదిమంది వచ్చినటు లయిన వా రా సంగతి గ్రహించి యా రెండవత్రోవను పారిపోవుదురు. అందుచేత రామం! నీవు త్వరగా పోయి మనవారిని తీసికొని రమ్ము. నే నంతవర కిక్కడనే కాచుకొనియుందును. తిండి కిబ్బంది లేదు కదా!" అన్నాడు.

"ఆహా! మంచి తెలివితేట లయిన పని. మనుష్యుల ను ప్రోగుచేసికొని తిరిగి వచ్చునప్పటికి నా కధమము రోజున్న రకు తక్కువ పట్టదు. అంతవరకు ని న్నీయడవిలో నొంటరిగా విడచి పోవలసినదా? ఊఁ. ఉఁ. ఎంతమాత్రము పనికి రాదా పవతి" అన్నాడు రాముడు.

తరువాత కార్యము వీలుగ కలసివచ్చునంతవరకునువారా లాగుననే కనిపెట్టుకొని యుండుటకు స్థిరపరచు కొన్నారు ఆప్రాంతములు పరిశీలన చేయుటకయి నలుప్రక్కల మెలకువగా తిరుగసాగినారు. కొంతసేపటికి ఏకాంక్షియు వాని

యమచరులు దూరిన కొండగుహావైపు పోయినారు. దాని ముఖమునందున్న కొండచాలా యెత్తుగనున్నది. కృష్ణుడు చాలా కష్ట ప్రయత్నము మీద రెండుమూడు గంటలు శ్రమపడి యాకొండ చివరకు పాకిపోయి లోపలకు తొంగిచూచినాడు. లోయ యడుగునకు సన్నగిల్లి గిన్నె మట్టులాగున నున్నది. దానిలో నొకప్రక్క నొకచిన్న చెరువున్నది. దాని గట్టుననే వారి గుర్రములు మేయుచున్నవి. కుర్రవాం డ్రభిప్రాయపడి నటు లది గుహ కాదు. ఒకలోయ. దానికి రెండవ మార్గము లేదని తెలిసికొని కృష్ణుడు సంతసించినాడు. అది నాలుగు ప్రక్కలను యెవరును యెక్కుటకు సాహసించ చాలనంత యెత్తయి గొడుదుడుకుగనున్న కొండలతో నావరింప బడియున్నది. ఆ తుంటరు లిపుడొక బోనులో చిక్కుకొనిరనుటలో విపరీతమేమియు లేదు.

కృష్ణుడు వారి స్థితిగతులు గ్రహించ ప్రయత్నించినాడు. లోపలివారు వారి ప్రతిపక్షుల దండయాత్రలకు సిద్ధపడి యుండకపోలేదు. వారు ప్రవేశించిన గుమ్మము దగ్గర లోపలి వైపున నొకయెత్తయిన రాతి గోడయున్నది. దానికక్కడక్కడ చాలారంధ్రము లున్నవి. ఆ కన్నములు తుపాకులాన్చి లోపలివారికి ప్రమాదము లేకుండా ప్రతికక్షుల నెదుర్కొనుట కేర్పడినవి. అది యొక విధమైన కోటబురుజు. దానికి రెండు వైపులను రెండు లావుగనుండు బలమైన గొట్టము లున్నవి. అవి రాయి దొలచి తయారు చేయబడినవి. అవి మొదల

కా యని కృష్ణు డాశ్చర్యముగా చూడసాగినాడు. అంతలో నొకమానవు డక్కడకువచ్చి, యాగొట్టములు చివర దులిపి శుభ్ర ముచేసి చిన్నడబ్బీ యొకటితీసి యందులోని పొడుము కొంత యారంధ్రములలో వేసి బరువైన పలుచని రాతిముక్కలు మాతవేశినాడు. అవి యవసరము వచ్చినప్పుడు నిప్పుతగిల్చిన పేలి, శతృవుల కెక్కువ ప్రమాదము కలుగచేయుట కేర్పడినవి. అందుపోసినది తుపాకిమందని కృష్ణుడు బోధపరచుకున్నాడు. 'ఆహా' వారితెలివితేటలు. రెండు పొడవైన రాళ్ళు పొడవుగా గుండ్రముగా చేసి, లోపల దొలచి చెవులులాగున ప్రక్కను రెండుచిన్న కన్నములు చేసి, యొకమాదిరిగా ఫిరంగులలాగున తయారుచేసినారు. ఎవ్వడయిన--అంత్యావస్థ తటస్థించులాగున కనుపించెనా వా రదిపేల్చి, లోయయు దానితోపాటువారిమీదకు దండెత్తి వచ్చి యందు ప్రవేశించ ప్రయత్నించిన ప్రతిశత్రులను కూడ పేల్చివేయ కలుగుట కేర్పాటయినది

సంగతంతయు కనిపెట్టి కృష్ణుకు జాగ్రత్తగా క్రిందకు దిగివచ్చి రామునకు చెప్పినాడు. అప్పటికే దాదాపు సాయంకాలము సమీపించుటచేత వారు మకామునకు పోయి వంట చేసికొని కడుపుబాధ తీర్చుకొని విశ్రమించినారు.

  

## ౧౬

మరుసటి యుదయమునలేచి, వారేమి చేయుటకును తోచక తటపటాయించుచు కాలకృత్యములు తీర్చుకొని కాలమువృథగ పోవుచున్నదని విచారించి యటునిటు తిరుగులాడుచున్నారు. అంతలో యిరువురు మానవులు ప్రతికక్షుల లోనివారు గుహాశిలను తెరచుకొని వెలుపలకు వచ్చినారు. వారినిచూచి మనచిన్నవాండ్రు కంగారుపడి ప్రక్కకు నక్కి, నెమ్మదిగా రాతి ప్రక్కనుండి తొంగిచూచినారు. వారిలో నొకడు ఏకాక్షియని సులువుగా తెలిసినది. రెండవవాడెవడో? దట్టమయిన బుగ్గమీసము, గుబురుగానున్న కురుచనిజుట్టు, బలిష్టములైన యవయవములు పుట్టగోచీతో వాడొక కిరాతునిలాగున కనుపించుచున్నాడు. వారేదియో మాటలాడుకొనుచు కొండలచాటుగా చాలదూరము పోయినారు. మరియొక రెండుమూడు గంటలలో నా కిరాతుడె యొంటరిగా తిరిగివచ్చి యక్కడ దీక్షగా కనిపెట్టుకొనియున్న రామకృష్ణులకు కనుపించినాడు.

“ఏకాక్షి యేమయినాడు? వాడుతిరిగి యే కొంపతీయు ప్రయత్నమో చేయుచుండుటలేదుకదా” అని చిన్నవాండ్రనుకొన్నారు.

ఈ లోపున కిరాతునిలాగున నున్న యా తుంటరి వారిని దాటి గుహావద్దకు పోవుచున్నాడు.

కృష్ణుడు తొందరగా "రామం! వాడొంటరిగా నున్నాడు కదా! మనము వాని మీద పడి పట్టుకొనిన?" అన్నాడు.

"ఆహా! మంచి పనే. వాడేమి సామాన్యముగా నున్నాడు కనుకనా! మన కోటివాండ్ర కొక డజనుకు సమాధానము చెప్పరక మది. అది కాక మనము వానిని నొక్కనిని పట్టుకొనిన నేమి లాభము? మిగత వారందరును మిగిలి పోవుదురు. అదియును గాక నసలువాడు యేకాక్షి మిగిలి యెప్పటిలాగున మామూలాట ప్రారంభించును. కష్టపడి యయినను వానిని పట్టుకొనుట మంచిది. వాడు చిక్కినా మిగతవారందరును ముందంకె చెరిపివేసిన తరువాత సున్నల లాగున నిరర్థకు లగుదురు" అన్నాడు రాముడు.

వారు యేకాక్షి రాక కొరకత డదివరకు పోయిన వైపు దృష్టి నిగిడ్చి దీక్షగా చూడ సాగినారు. ఆలాగున చాల కాలము గడచిపోయినది. మధ్యాహ్నము మీరుచున్నది. అంతలో వారికి వెనుక చేరువనే పదధ్వని వినవచ్చినది. వారు పరధ్యాన్నముగా నుండుటచేత నంతవర కేదియును గురుతించలేదు. వారొక్క సారిగా త్రుళ్లిపడి వెనుకకు తిరిగి చూచినారు. తుంటరి జట్టులోని కిరాతుడు వారి యెదుట చేత పిస్తోలు పట్టుకొని యమజుటులాగున నిలుచున్నాడు.

మనవారికి మీాద(పాణములు మీాదకు లేచిపోయినటు లయినది. మాట తొణకినది కాదు. కొంత సేపటివరకు వారు మాట మంతి లేక నాలాగుననే నిలువబడిపోయినారు. అంతలో కృష్ణుడు చెట్టునకు తగిలించిన కోటు జేబులోని పిస్తోలు కొరకు తొందరగా వెనుకకు తిరుగబోయినాడు. కిరాతస్వరూపుడు నవ్వుచు, "ఆ. ఆ! ఆగు మహాత్మ అబ్బాయి! నీవంత శ్రమపడ నక్కరలేదు. నా చేతిలో నొక టున్నదిలే యటువంటిది-- అవసరమునకు. అదికాక నీవు కదులు టంత మంచిదికాదు. ఇది వెంట పడకలదు" అన్నాడు.

కృష్ణుడు కంగారుపడి, యాగిపోయినాడు. రామునకంతయు విపరీతముగా కనుపించినది. కిరాతుడు క్రూరత్వము లేక తాజాగా మందహాసము చేయుచు సాత్వికముగా కనుపించినాడు.

అతడు క్షణములో వారిని దగ్గరకు చేరపిలిచి, యేదియో మాటలాడి వెడలి పోయినాడు. రామునకు నమ్మకము కలిగినది కాని కృష్ణునకు చాలినది కాదు. వారు వెంటనే రొట్టెకాల్చుకొని తిని యొక గంటలో బయలుదేరి గుహ దగ్గరకు పోయి తలుపు బలవంతముగా గెంటి తెరచి లోపల ప్రవేశించి కనిపెట్టి చూచినారు, దూరమున ప్రతిశత్రులు కులా

సాగా భోజనము చేయుచుండుట కనుపించినది. వీ రక్కడనే చాటున దాగొని నిరీక్షించి చూడసాగినారు.

అలాగున నొక యరగంట, గంట, గంటన్నర, రెండు గంటలు గడచిపోయినవి. అంతలో రాము డాకస్మికముగా లేచి "ఆ! ఆ! ఇదే సమయము. రా! రా! పిస్తోలు సిద్ధముగా నున్నదా? అవసరము వచ్చిన" అని కృష్ణుని తొందరచేసి లాగినాడు. పరధ్యాన్నముగా కూరుచున్న కృష్ణుడు తృళ్లిపడి లేచి రామునితో కలసి పరుగుప్రారంభించినాడు. వా రక్కడ చేరునప్పటికి కిరాతాకారుడు చేత పిస్తోలుపట్టుకొని మిగత వారిని బెదిరించి చేతులు మీదకెత్తించి వరుసగా నిలువపెట్టినాడు. వారు పెంకితనము చేయుచున్నారు కాని గత్యంతరము లేక చచ్చినటుల చెప్పినప్రకారము చేయవలసివచ్చినది. రాముడును కృష్ణుడును యక్కడచేరి యొకని తరువాత నొకనినిగా నందరను బంధించినారు. రామకృష్ణుల సహాయమున నా కిరాతు డా తుంటర్లను గుహాముఖము దాటించి వెలుపలకు తీసికొనివచ్చినాడు. అంతలో వెనుక 'ధాం' అని పెద్ద చప్పుడు వినుపించినది. రాము నక్కడ బందీలదగ్గర గావుంచి కిరాతుడు కృష్ణుని వెంటపెట్టుకొని వెనుకకు పరుగెత్తిపోయినాడు. అక్కడ పెద్దపెద్ద తుట్టలుతుట్టలుగా బయలుదేరిన పరిమితివిూరిన పొగయును, దానితోపా టాకాశములోని

కొగిరి క్రిందదొర్లి పడు చిన్న చిన్న రాళ్ళును వారికి కనుపించి నవి. వా రది నిర్ఘాంతపడి చూచునంతలో నా పొగతో మూలు గుచున్న మానవకంఠస్వర మొకటి వారికి వినుపించినది. పొగ వచ్చువరకు కక్కడనే కనిపెట్టుకొనియుండి కిరాతుడును కృష్ణు డును యక్కడ కొండమొదట నొక బలమైన రాతిక్రింద ప్రక్కకు పడినలుగుచు కదలలేక కదలప్రయత్నమైన చేయ లేక వచ్చు మొగము వేసికొని పడియున్న యేకాకిని చూచినారు.

వారు దీనముగా సహాయము నపేక్షించిన వాడు. వారు న తొందరగా దగ్గరకుపోయి కష్టప్రయత్నముమీద రాయిప్రక్క కు దొర్లించి వానిని వెలుపలకు లాగినారు. కాని వానికా లొకటి మాత్రము గుండక్రింద నలిగిపోయినది. తొడయెముక విరిగిపోయినది. వారు వానిని సహాయపెట్టి వెలుపలకు తీసికొని వచ్చి పొడుగానున్న కర్రలతో చిన్నతొట్టి యొకటి తయారు చేసి కుంటివాని నందు పరుండపెట్టి బందీలోనున్న వారిచేత పట్టించి యింటివైపు ప్రయాణమయినారు. వారుకొంత దూర ము పోవునంతలో మరికొందరు వాని సహాయార్థ మెదురు వచ్చినారు.

  

## ౧౭

రెడ్డిగారి కూలీలలో నొకడు పారిపోయిన తుంటర్ల వెనుక ప్రయాణమయిన రామకృష్ణులనుచూచి సందేహించి తిన్నగా గూడెముపోయి పోలీసు వారిని సహాయము తీసికొని వచ్చినాడు. వా రా క్రితమురాత్రియే రెడ్డిగారియిల్లు చేరినారు. అప్పటికప్పుడే యగ్గిబాబా ప్రాంతముల విడిచిపోవుటచేత రెడ్డిగారు యేవిధమైన సంకోచమును లేకుండ పోలీసువారి కాతిథ్య మొసగినాడు. వారందరును చీకటితోడనే లేచి బూసిగాడు జాడలుతీయ వీరికి యెదురు వచ్చినప్పటికి మధ్యాహ్నము మీరినది. బందీలందరును పోలీసువారి స్వాధీనములో నురక్షితులైన తరువాత రామకృష్ణులు స్వేచ్ఛగా యూపిరి తీసినారు.

వారందరును కాలెడు కడుపులతో కాళ్లీడ్చు కొనుచు యిల్లుచేరునప్పటికి చాలరాత్రి యయినది. భోజనము లగునప్పటికి మరియు రాత్రి యయినది.

బందీలందరును పోలీసువారి స్వాధీనమున నుండుటచేత రామకృష్ణులు గత రెండుమూడు దినముల బడలిక తీరునటుల స్వేచ్ఛగా నిదురపోవగలిగి నారు. కిరాతుని స్వేచ్ఛగా నుంచవలయునని వారుకోరినారు. కాని పోలీసు వా రంగీకరించక

కొంచెము స్వేచ్ఛగానయినను వారు వానిని తమస్వాధీనము ననే వరుండపెట్టుకొని వంతులువేసికొని కావుకాచినారు.

తెల్లవారినది మామూలు ప్రకారము. పోలీసు దళా ధికారి నగర్వముగాలేచి హెచ్చరికగా బందీలనులెక్క చూచి నాడు. ఒకడు తక్కువ యయినాడు. కిరాతుడులేడు. కంగారు పుట్టినది పోలీసువారికి. నలుగురు నలుప్రక్కల పోయినారు. ఎక్కడను కనుపించ లేదని తిరిగి వచ్చినారు కాఫీలవేళకు.

అందరును ముందువసారాలో సమావేశమైనారు. బం దీలను సాధ్యమయినంత త్వరలో తరించ వలయుననియును, లేని పక్షమున తరుగు క్రమముగా వృద్ధియగుననియును పోలీసు వారి యనుమానమును భయమును. అధికారి చాలాతీవ్రముగా „అయ్యా! రామకృష్ణులు. మీ మూలమున నింత మూగినది లేనియెడల నా తుంటరి దాటిపోవ గలడా?" అన్నాడు.

„అయ్యా? వానిని దాటిపోనీయమని మిమ్మెవరు ప్రా ర్థించినారు? „ అన్నాడు కృష్ణుడు.

„మీరు వానిపక్షము పూనినారు. మీయింటనుండి..."

"అయితే? మీరు మా మాటపైవిశ్వాసముంచక మీ చిత్తప్రకార ము చేసినారు. వంతులువేసికొని కాపున్నారు. ఇ ప్పుడు ప్రమాదము సంభవించినదన మాలోటేనా? మేము చెప్పినటుల చేసిన తరువాత నేమి జరిగియుండినను పూచీ మాది" అన్నాడు రాముడు.

"ఏమి జరిగియుండును? మిగతవారు కూడ దాటిపోయి యుందురు "అన్నాడు అధికారి.

„అయితే నదికూడ తప్పెనా? మీరు మాచెప్పిన రీతిని చేయలేదయిరి. వంతులు వేసికొని కాపు కాచినారయిరి. దొంగదాటి పోయినాడు కనుక వూచివారులము మేమును మా నవుకర్లును. ఎంతగొప్ప సంగతి. ఆహా! "అని కృష్ణుడు వికటముగా నవ్వినాడు.

„అయ్యా! ఇదంతయు నాకు తెలియును. అతను దొరక లేదనుటకు వీలులేదు. దొరికి తప్పించుకొని పోయినాడనుట కంతకన్నను వీలులేదు. ఏదయినను ప్రమాదమే, అయ్యా రెడ్డిగారూ! దీనికి మీరు వూచివారులని నే ననవలసి వచ్చినందులకు నాకు చాలా విచారముగా నున్నది. "అన్నాడు పోలీ నధికారి తీవ్రముగా కడుపుమంట తీరునట్లు.

"మాయింటినుంచి తప్పించుకొని పోవుట వాస్తవమే కాని యెవరిస్వాధీనము లోనుంచి తప్పించుకొని పోయినాడందురు? మంచిమాటే! పిసుగునకును బియ్యమునకును ఒక్కటే మంత్రమా? చాలు! చాలు! విశ్వాస పాత్రుడయిన మాఅబ్దుల్ కనుపించడు. ఎమయినాడో యేప్రమాదమున చిక్కుకొని పోయినాడోయని మే మాలోచించుచుండ మధ్య నిదియొకటియా?" అన్నాడు రాముడు.

"అబ్దుల్ సంగతి కన్ను, కాలు లేని యీ బుద్ధిమంతు వడిగిన తేలగలడు" అన్నాడు కృష్ణుడు.

ఏకాంతీ మూలుగుచు "దానికి కూడ రెడ్డిగారే పూచీ. వారియింట నవుకరుగ నుండగనే కదా యతఁ డదృశ్యమయి నది" అన్నాడు.

"ఏమి? ఏమంటివి? రెడ్డిగారు పూచీయా యన్నిటికిని?"

"అవును. రెడ్డిగారు గాక మరియెవరు పూచీ. నా కవన్నియు వనికిరావు. మీ యింట తప్పించుకొని పోయిన యపరాధి కనుపించకపోయిన......"

"ఊఁ, కనుపించక పోయిన...? అయిన మనకెందులకు? మన కాపలా యెందులకు?-మీ కెవరిచ్చినారోగాని యీ యుద్యోగములు మంచి..."

"ఆ. ఆ. కృష్ణా." అని వారించినాడు, పోలీసు పరిస్థితులు తెలిసిన రెడ్డిగారు.

"ఆ. ఆ. కృష్ణా! ఆగుము. అంత తొందర యేమియు లేదు. వారి ముచ్చటలే తీరనిమ్ము". అని కేకలు వేయుచు వారు క్రిందు మీఁదగుచున్న కిరాతు డక్కడ ప్రత్యక్షమయినాడు.

♦ ♦ ♦

పోలీసధికారి పోయిన ప్రాణము లేచివచ్చినటుల పెద్ద కేకలువేయుచు చంగున లేచి యప్పుడే లోపలప్రవేశించిన కిరాతుని భుజము పట్టుకొన బోయినాడు. కిరాతుడు సగౌరవముగా వానిని దులిపివేసి ,,చాలు. చాలు. కృష్ణుని మాటలకు తమరంత యులకనేల? తమ రధికారులు. సర్కారువారి యుద్యోగమొకటి యాధారమున్నది తమకు. లేకపోయిన...... అపరాధులతో పాటు నిరపరాధులను కూడ నేమిచేసినను చేయగలరు. లేకున్న మీరు సకలకష్టములు పడి చావుతెంపులయి, చేయునది లేక చచ్చుమొగములు వేసికొని ప్రజలమీద స్వేచ్ఛగా విహరింపుడని విడిచిపెట్టిన గుంపును పట్టియిచ్చిన రెడ్డిగారిమీద ప్రతాపము చూప ప్రయత్నింతువా బాబూ? మంచిమాట. గ్రంథస్తము కావలసిన కృతజ్ఞత. ఇక తమ పరిపాలనమున మంచికిని చెడ్డకును భేదమేమి?" అన్నాడు.

అధికారి సిగ్గుపడుటకు మారు కండ్లెఱ్ఱచేసి ,,ఏయి! అనవసర సంభాషణ చేయక. జాగ్రత్త. నే నెవరనో యెరుగుదువా?" అన్నాడు.

"చిత్తము. ఎరుగకేమి? మండలముఖ్యస్థానమున పూలమొక్కలకు బాల్చీలతో నీరుమోసి, అధికార్ల జోళ్ళ తాళ్లు బిగియించి,.........ఉచ్చనీచములు లేక యున్నతాధికారులదగ్గర చాకిరీచేసి క్రమముగా యింతవరకు వచ్చిన మిమ్ము నే నెరుగకపోలేదు. తమరే నన్ను మరచియుందురు. క్షమాగుడు" అన్నాడు.

తోఁచ తెన్ను లేక నొవరికో యొకరికి ప్రమాదించు లాగున కనుపించిన యీ వింత సంభాషణ కాటంకము కలిగించ దలచి, రాముడు "అయ్యా! నీ సంగతి మాకు వింతగా నున్నది. నీ వస లెవరవో తెలియదు. గుంపువారితో చేరిన నీవు మాకు సహాయ పడుట యెందులకో యంతకన్న తెలి యదు. దయయుంచి........." అను నంతలో—మందహా సముచేయుచున్న నా కిరాతాకారుడు నెమ్మదిగా "అయ్యా! రెడ్డిగారు. నేను తమ దర్శనము చేయుట కిదియే ప్రారంభము కావున నా నమస్కార మందుకొనుడు" అనుచు నతడు రెడ్డి గారు మాటలాడుటకు సరుదుకొనునంతలో ప్రక్కకు తిరిగి తలమీది పెద్ద ముతకగుడ్డ పాగయును, తుంట్లమీద చుట్టిన ముతకపంచియును విడిచివేసి, బిరుసు మీసమును, బుగ్గమీస మును యరచేతితో గట్టిగ తుడిచి పారవేసి, తలమీద చిన్న తురకటోపీతో, మోకాళ్ళవరకు నున్న షరాయితో నిలచినాడు.

కృష్ణుడు తురత్రితనముచేత, నూతనముగా వచ్చిన వాడ యినను యట్టి సంధిగ్ధావస్థలో ప్రాణములకు కూడ తెగించి తమ కంత సహాయపడిన యువకుడు తిరిగి కనుపించినందున సంతోషము పట్టచాలక "అబ్దుల్, అబ్దుల్" అన్నాడు. మిగత వా రాశ్చర్యమును వెలిబుచ్చుచు గుంపులోని కిరాతుడును, అబ్దులును యొక్కడేనా యని యాలోచించసాగినారు.

"ఎవరయిననేమి మా కారాగార మలంకరించుటకు. దానికి జాతి, మత వివక్షత లేదు" అన్నాడు పోలీసాయన.

"అవును. మనకు మంచి చెడ్డలతో పాటు."

"ఆలాగే మరీ" అని యబ్దుల్ వాని నసహ్యాభావమున చూచి "చిత్రము. క్షణమాగుడు తమరు" అనుచు నతడందరివైపునను ముఖ్యముగా రెడ్డివైపునను చూచి "అయ్యా! నా చిన్నతనమునకు క్షమించుడు. నా నమస్కారము లందికొనుడు. నే నింటిదగ్గర బయలుదేరిన పని వేరు. ప్రవేశించిన పని వేరు. పరిసమాప్తికావించినది వేరు. ఇక్కడ మా తోబుట్టువునకు మంచి సంబంధము చూచితినని మా తాతగారు చెప్పుటచే చూచివత్తమని నేను బయలుదేరినాను. కొంత దూరము వచ్చినతరువాత నీ ప్రాంతములలో దౌర్జన్యములు జరుగుచున్నటులను తెలిసికొని, యాసంగతి ముందు చక్కపెట్టుదమని సరదాపుట్టి యక్కడకు పోయి యాకిరాత వేషమున వారితో కలిసి యిష్టములేకపోయినను వారితో పాటు చిల్లర దౌర్జన్యములకు సిద్ధపడినాను. పోలీసువారు నన్నొకసారి గూడెములో బంధించిన రాత్రి. స్టేషను బ్రద్దలు కొట్టి నన్ను విడిపించుకొనిపోవుటలో యీ బుద్ధిమంతుడు జోగులు, యక్కడ పహారాకు స్వస్థి చెప్పి హాయిగా నిదురపోవుచున్న పోలీసు వానిని చంప సిద్ధపడినప్పు డంతవరకవసరము లేదని వానిని వారించి, బంధింప చేసినాను. వాడొకసారి రాముని బంధించి నూరు రూపాయీలు మీ వలన ముట్టకపోయిన రాముని చెవులు మీ కందచేయుదు మని మీకు వ్రాసినపుడు, అంతవరకును వచ్చిన రామునకు సహాయము చేయ దలచుకొని, మేము విడచి పోవునపుడు కన్ను విసరి సంజ్ఞ చేసి వానిని ధైర్యముగా నుండుమని హెచ్చరించి

నాను. కాని బూసిగాని మూలమున నా సహాయ మవసరము లేకపోయినది. ఈ విధముగా వారికి తెలియకుండ వారి చిత్తమునకు నచ్చినటుల ప్రవర్తించుచు నమ్మకము పుట్టించి యెటులయిన వారి నిక్కడకు తీసికొనివచ్చి బంధించి, బుద్ధి చెప్పి పంపవలయు నని నా యభిప్రాయము. ఇక్కడ పరిస్థితులు కూడ చూడవలసి యుండుటచే నాకు కొంచెము పని యున్నదని యేకాక్షికి నచ్చచెప్పి అబ్దుల్‌లాగున నిక్కడ చేరినాను. ఇక్కడ కొలదిరోజు లుండి తిరిగి గుంపు చేరి వారిని పట్టుకొను నేర్పాటు చేయవలయు నని నా యభిప్రాయము. కాని వజ్రములు నాయరు కంటపడి నా పన్నాగమును కొంతవరకు పాడు చేసినవి. నే నిక్కడ నుండగనే వారు దండెత్తుట తటస్థించుట చేత నే ననుకొనినటుల జరగలేదు. నే నా రాత్రి సహాయార్థము పోవునప్పుడు నామీద దౌర్జన్యము చేయ ప్రయత్నించిన నాయరును నా కిష్టము లేకపోయినను కొట్టవలసి వచ్చినది. నేను సహాయము తీసికొని వచ్చునప్పటికి గుంపువారు పారిపోవు ప్రయత్నములో నుండుటచే నింత శ్రమ గలిగినది. సహాయార్థము మరియొకరిని పంపి నే నిక్కడ మిగిలిపోయిన బాగుండెడిది. వారి నందరిని నిక్కడనే బంధించియుందును.

"తరువాత రామకృష్ణు లారీతిగా యుపవాసములు చేయుట తటస్థించి యుండకపోను. గుంపువారు తిరిగి పారిపోవు నంతలో వారిని మధ్యత్రోవలో కలిసికొని, ముట్టడికి నేను లేకపోయినందులకు చాల విచారించిన గుంపువారితో కలిసి కొంత దుఃఖము నటించి, వారితో కలసి గుహాలో ప్రవేశించి

నాను. రామకృష్ణుల రాక నాకు మొదటి రోజున తెలియలేదు. తెలిసిన తరువాత వారి స్థితి గ్రహించి నే నిక నాలశ్యము చేయుట మంచిది కాదని, వారి సహాయమున గుంపువారిని బంధించుట సుకర మని వారితో కూడపలికి, భోజనముల వేళ వారి యాయుధముల చిక్కపట్టి వారిని కోరలులేని పాముల చేసినాను. అ దంత వీరపురుష లక్షణము కాదు కాని వారిని పట్టి, చేయక తప్పినది కాదు. అప్పుడు జరిగిన పోరపా టేమ న నంతకు పూర్వము నాతో బయలుదేరి వెలుపల మిగిలిపోయిన యేకాక్షి మాట మరచిపోయినాను. వాడు మిగిలిన యెడల మన పనికి చిక్కు కలిగియుండును. మరల నింత ప్రయత్నమును చేయవలసి వచ్చియుండును కాని విధికూడ మనకు సహాయపడినది. ఈశ్వరానుగ్రహము వలన వాడు తిరిగి వచ్చుచు, మందుగొట్టము పేల్చి, చేయవలసినంత పని చేసినాడు. కాని రోజు బాగుండక క్రిందపడి నలిగి మనకు చిక్కినాడు. తరువాత వారు పోలీసువారికి చిక్కుటచే మనము చేయున దేదియు లేకపోయినది. వ్యవహార మింత సులువుగా సునాయాసముగా, పరిసమాప్తి నొందునని యనుకొనలేదు. నేను మొదట యాలోచించిన ప్రకారము గుంపువారి నందర నిక్కడ కాహ్వానించిన పట్టుకొనుట చాల సులువుగా నుండెడిది. కాని, గుంపువా రిక్కడకు దండెత్తివచ్చుటచేత వ్యవహారము కష్టసాధ్యమగు నను కొంటిని గాని యీశ్వరానుగ్రహముపలన నిది మరియు సులువైనది.

అనుచు నతడు వెలుపలకు పోయి, ముఖముకు శరీ

మును శుభ్రముగా తుడుచుకొని శుభ్రవస్త్రములు ధరించి, యసలు రూపున నలుగురిలోనికి వచ్చునప్పటికి పోలీ సధికారి వానిని చూచి సిగ్గుపడి మారుమొఖము పెట్టినాడు.

అంతలో పనివా డొకడు వచ్చి నాయరు తొడలోని దెబ్బతో మూడు రోజులనుండియు తిండిలేక చావ సిద్ధముగా వాగు ప్రక్కను పడియున్నా డని చెప్పినాడు. ఆ సంగతి విని రెడ్డి జాలిపడి వాని నింటికి తీసికొని రా నాజ్ఞాపించినాడు. "శరీర స్వస్థత కలిగి, తిండి యొంట పట్టువరకు మన యింట నుండనిండు" అన్నాడు.

అంతలో సబ్బుల్ వేషధారి వైపు చూచి పోలీసధికారి "అయ్యా! నన్ను క్షమించుడు. నేను మిమ్ములను గురుతించ లేకపోయినాను." అని మిగతవారివైపు చూచి "నేను చిన్న నవుకరీలో చేరినది మొదలు పెద్ద యగువరకును వీరి నాయనగారి తరిఫీదులోనే యుండి వారి యనుగ్రహామువనే యింతవరకు వచ్చినాను" అన్నాడు.

"సరే. ఏకాక్షి నిరర్థక మైనాడు. వా డిక నేవిధమైన యపకారమును చేయజాలడు ప్రజలకు. వాని తిండియే వాడు తెచ్చుకొనలేడు. వాని మూలమున కాని, లేకపోయిన మిగత వారు కష్టపడి పని చేసికొను రకమువారే. ఇక నేకాక్షి లేక పోవును గనుక జట్టు విడిపోవును. ఎవరిమట్టుకి ... రు న్యాయ జీవనమునకు దిగుదురు. అందుచేత వారిని క్షమించి విడిచిపు

చ్చుట నా యభిప్రాయము. తరువాత......" అని రెడ్డివై
పు తిరిగి "అయ్యా! సెలవు లాఖ రగుట చేత నేను కొలది
రోజులలోనే చదువుకొనుటను చెన్నపట్నము పోవలయును.
నిచ్చట నున్న తక్కువ కాలములోనే రాముని లక్షణములు
ప్రవర్తన నాకు పూర్తిగా నచ్చుటచేత మా తాతగారి యభి·
ప్రాయమును స్థిరపరచుకున్నాను. నేను దూరముగా పోవు
లోపుననే కళ్యాణము జరిగిపోవలయును" అని రామకృష్ణుల
తో కలసి వెలుపలకు పోయినాడు.

నిత్యము పరియాచకములతో కాలక్షేపము చేయు కృ
ష్ణునకు సమయమును, సహాయమును కూడ దొరకినందున, నా
సోదరుల పరియాచకములకు రాము డాగలేకపోయి నూత
నానందమున మరచు పరచుకొన ప్రయత్నించుచు, భావమరది
యప్పుడే యిచ్చిన సీతారత్నముచేతి యుంగరమును తన చేతికి
తగిలించుకొని తాతగారి యెడల కృతజ్ఞతతో, నూతనవధువును,
యామె సుగుణ సంపత్తియును, రూపురేఖా విలాసములును
తలచుకొని మరియు మరియు మురియ సాగినాడు.

ఏ కా క్షి స మా ప్త ము.



తో నాకు తోచిన యభిప్రాయమును గుట్టుపరచక నిర్భయము
గా వెళ్ళడించితిని. కాని యది యల్లరయి రచ్చకెక్కునని య
నుకొనలేదు. వేళాకోళమునకు వచియించిన మాట సభాస్థాన
మున ధృవపరచ వలసి వచ్చినందులకు నా కెంతమాత్రమును
విచారమును లేదు గాని యించుక సందేహించ వలసి వచ్చుచు
న్నది. అయినను తప్పనిసరి యని రాజాజ్ఞ యగుటచేత చెప్పక
తీరక చెప్పుచున్నాను. నేను చిన్నదాననయినను నా తల్లికి
నా తరువాత నెనమండ్రుగురు—నాకు సోదర, సోదరీ మ
ణు లున్నారు. అదియునుగాక మా యమ్మ ప్రసవించు నప్పు
డు లోకసామాన్యముగా గాక ప్రసవవేదనము చాల యెక్కు
వగా నుండును. నేను చిన్నపిల్లగా నుండినపు డేమో గాని నా
కు గ్రాహ్యము వచ్చినతరువాత నామె పరిమితిమీరి నొప్పులు
పడుట యును మాయయ్యయును, యింటనున్న తదితరబంధువులు
ను దయ్యములకు దేవుళ్ళకు మ్రొక్కుటయును చేరిన యిరుగు
పొరుగు వారు పరితాపపడుటయును, నేను బాగుగ నెరుగుదును.
మాయమ్మయును నా సమయమున నానా బాధలు పడుచు వచి
యించు విరక్తి వాక్యములు వినిన నాకు మతి పోవుచుండెడిది.
అట్టి ప్రతి పురుడును యామె కాఖరు పురుడేసని నేను తలంచు
చుండెడిదానను. కాని యటులగా జరుగలేదు. అయ్యో! నే
నింతకన్న నేమి చెప్పగలను. సభామధ్యమున నాడుపిల్లను. ఇక
దేనియందు రుచిరో..." అని యనుకుచు సిగ్గువెలిబుచ్చుచు

కూరుచున్నది. ఇక సభలోని సంగతి వ్రాయనక్కర లేకుండ గనే పాఠకులు గ్రహించ గలరు.

తరువాతి వంతు కమ్మవారి పిల్లది. ఆమె తాజాగా లేచి నిలచి "అయ్యలారా! నేను చెప్పిన సంగతి నేనే ధృవ పరచవలసినంత యగత్య మేమియు కనుపించదు. ఏల నన యందలి రుచి యాబాల గోపాల మందరకును యనుభవైక వేద్యము. డబ్బు సంపాదనలోని రుచి తెలియనివా రెవరు నుండరు. ప్రజలను మోసగించియో, అధికారులను మాయచేసియో, తాబేదార్లను భ్రమపెట్టియో, మామోళ్ళనియో, మశాన మనియో, లంచము లనియు, నజరలనియు, ఉపకారముచేసి యు చేయకుండ ప్రతిఫల మొసంగకుండ యొరుల దగ్గర డబ్బు లాగ ప్రయత్నించి, లాగుచు ముందు జన్మముల తీర్చు కొను పద్ధతిని ఋణపత్రము లేర్పరచుకొనువా రెందరు లేరు. యమలోకమునకు రహదారీ చీటీ కొనుక్కొనువారి నెందరను మనము చూచుచుండుటలేదు. అన్నిటకన్న విశేష మే మన తామష్టకష్టములు పడి సకల గడ్డలు గరచి చెప్పరాని నీచాతి నీచములకు సిద్ధపడి, దానధర్మములు లేక, ఒకరి కీయక తా ముకూడ ననుభవించక, సిగ్గుభిడియములు విడిచి, యాత్మగా రవము చంపుకొని యన్నివిధములు సంపాదించి మూటకట్టు డబ్బు, తమరు చచ్చిన తరువాత తమ వెంట నొక్క యదు గైన రాదని తెలిసియు, తమ తదనంతర మది యేమగునో గ్రహించియు కూడ నన్ని యేడ్పు లేడ్చు కోతిపిడికిలి ముండ

కొడుకుల నెందరను చూచుచుండుటలేదు. వారిని చూచి జాలి పడవలయునా? దుఃఖపడవలయునా? అయ్యలారా! ఇంత కన్న నేమి చెప్పవలయును?” అని యూరకున్నది.

తరువాత వంతు రాజులపిల్లది. ఆమె తాజగా లేచి “అయ్యా! నా వాక్యము ఋజువుపరచ వలసి వచ్చుట నాకు చాల కష్టముగా నున్నది. ఏమన నది కేవలము రుచియు, రుత్తియు లేని పాడువస్తు వని తెలిసియుండియు, అంతకన్న రుచిహీన మయినది మరియొక టీ ప్రపంచకమున లేదని యెరిగియుండియు, యది యన్నిటికన్న రుచివంత మయినదని ఋజువు పరచ సిద్ధపడుట కేవలము సాహసమే. మరియొక బాధ యేమన సామాన్య సంఘమున విచ్చలవిడిగా విహారించుచున్న నీ సారాయ మిప్పు డున్నత సంఘమున కొంచెము రహస్యముగా నయినను యెక్కువగనే సంచరించుచున్నది. అందుచేత నింద రుత్తములు, యధికారులు గల యీ సభా మధ్యమున నా సంగతి......సరే దానికేమిలెండు. సారాయము వాడు జనసంఖ్యయును, దాని మూలమున వ్యయపడు ధనసంచయమును, యందునుంచి ధ్వంస మగుచున్న కుటుంబములును దిన దినము వృద్ధి గాంచుచుండుట మనము కన్నులార గాంచుచున్నాము. రాబడి వృద్ధియయి దాని మూలమున బాగుపడువారు—పన్నుల మూలమున నైననేమి, పస్కీల మూలమున నైననేమి, స్వల్పముగా నున్నను పాడగుచున్నవారు మాత్రము లెక్కకు మీరి యెన్నిరెట్లో యున్నారు. వా రందరును వారికి ముందు పాడయినవారిని, వారియెదుట పాడగుచున్న

వారిని కన్నులార కాంచుచు, తమరుకూడ నదే గతికి రాగల రని తెలిసియుండియు, నదే త్రోవను పోవుచున్నా రనిన యందలి విశేష రుచియే కదా దానికి కారణము. మనకు తెలియక పోయినను యెక్కువ సంఖ్యగల నాజాతికి తెలిసి యున్న దందులోని రుచి. అంతకన్న శే రేమున్నది. ఏ ముందును? అని యూరకున్నది.

తరువాతి వంతు సానిపిల్లది. ఆమె ప్రారంభమున రా లేదని తెలిసియు నా సంగతి వెళ్ళడి యయిన తనమీాద కెక్కడ వచ్చునో యని జడిసి మంత్రి యా సంగతి గోప్యముగా నుంచి, యామె కొరకు రహస్యముగా కబురుమీాద కబురుగా నొకని వెంట నొకనిని తరుముచునే యుండెను. కాని యెన్నిసారు లయినను పోయినవారు పోయినటుల వచ్చుటయే గాక నామె యెప్పటికి రాగలదో సరిగా నా సంగతి కూడ తేలినది కాదు. ఎన్నిసారులు కబురువెళ్ళినను యాబాలిక 'ఇదిగో వచ్చెదను' 'అదిగో వచ్చెదను' అని కొన్నిసారులు చెప్పి తరువాత 'ఇదిగో వచ్చుచున్నాను' 'అదిగో వచ్చుచున్నాను' లోనికిమార్చి చివరకు "నేను దేవీపూజ చేయుచున్నాను. అది త్వరలోనే పూర్తి కాగలదు. కా గానే బయలుదేరి వచ్చెదను—'లోనికి దింపి సమాధానములు పంపినది.

రాజసభామధ్యమున నక్కడంతవరకు హాజరయిన బాలికలలో నాఖరు పిల్ల సమాధానము పూర్తి గావించి కూర్చొనిన తరువాత రాజు మరియొకపిల్ల తక్కువ యయినదని గ్రహించి యేమని మంత్రిని ప్రశ్నించినాడు. అతడును భ

యభక్తు లుట్టిపడ "మహాప్రభూ! ఆ చిన్న దింకను రాలేదు. ఎన్నిసారులు వర్తమానించినను ఇదిగో, నదుగో ననుటయే కాని యింతవరకు కనుపించదు. ప్రభువువారు నా యవజ్ఞతను మన్నించ ప్రార్థించుచున్నాను" అని వేడుకొనునంతలో రాజు తీవ్రముగా సభవైపు చూచి యక్కడ చేరియున్న నవుకర్ల నిరువురు గట్టివారిని పిలచి, యా పిల్లను తత్క్షణము వెంటపెట్టి తీసికొని రావలసినదని యాజ్ఞాపించెను. ఎంత గట్టి రాజభటులైన నేమి సానివారి నరసను.

వారు చాల తొందరగా సానివారి యింటికి పోయి పిలచినారు. ఆమె లోపల నున్నది. వెలుపలకు వచ్చుటకు వీలు లేదని చెప్పి యామె తల్లి వారలను లోపల కాహ్వానించి, యా పిల్ల పూజచేయుచున్న గదిగుమ్మము చెంతకు తీసికొనిపోయి, గదిలో పూజాదీక్షలో నున్న యా పిల్లను చూపించినది. వారు గుమ్మము దగ్గర నిలచి తొంగి చూచునప్పటి కాపిల్ల వినయవిధేయత లుట్టిపడ భయభక్తులు గనుపరచుచు లోపల నెవరితోడనో మాటలాడుచున్నది. వారక్కడాలాగున క్షణమాగి "ఇక తడవుచేయుటకు వీలులేదు. రాజాజ్ఞ నీకూతునకు నివేదించుము," అని కొండముచ్చువంటి యా వేశ్యమాతకు తెలియపరచిరి. ఆమెయును మెల్లగా గదిగుమ్మము లోపల చేరి యా సంగతి నెమ్మదిగా నాపిల్లచెవిని వేసినది. ఆ పిల్లయు కొంతసేపటికి కండ్లు తెరచి, రాజభటులవైపు తిరిగి తీవ్రముగా చూచి" అయ్యలారా! మీరు చాల కానివేళ వచ్చినారు. సమయము మంచిది కాదు . ఏలనన నే నిప్పు డిచ్చట

నుండి యెంతకయినను సరే, ఏమి సంభవించినను సరే, ఒక్క యుదుగైన నవతల పెట్టజాలను. రాజుగారు ధర్మస్వరూపులు. వారును వారితరపున మీరును రమ్మనుమని యాజ్ఞాపించిన నేను రాకుందునా? తప్పక చేతులు జోడించుకొని యచ్చట హాజరుకావలసిన దాననే. కాని నే నెప్పటిప్రకారము ప్రాతఃకాలముననే బయలుదేరి బావికిపోయి స్నానము చేసి వచ్చి పూజకు ప్రారంభించితిని. అంతలో దివాణమునుండి కబురువచ్చుటచేత తొందర తొందరగా ముగించి రావలెనని సిద్ధపడితినిగాని దేవి, సాక్షాల్లోకజనని తన దివ్యసుందర మయిన నిజరూపున నాకు సాక్షాత్కరించినది. నే నది విడచి, లభియించిన సావకాశమును పోగొట్టుకొనినచో, నిట్టి సావకాశము నాకు మరల లభియించగలదా? మహామహాలకు, భక్తపరతంత్రులకే యసలు లభియించదే! జన్మ పావనముకాగల యిట్టి యదను మరల దొరుకునా? మీరే దయయుంచి చెప్పుడు? కావున నాయనలారా! దయయుంచి మీరు తిరిగి వెడలి నే నివు డీసమయమున రాజదర్శనమునకు రాజాలక పోయినందులకు క్షమియించుమని కేలుమోడ్చి, సాష్టాంగపడి మరియు మరియు బ్రతిమాలితినని చెప్పుడు. వారి సెలవయిన నేడుగాక పోయిన మరియొకసారి. ఒక్కసారిగాదు వేయిసారు లయినను వారి దర్శనము చేయగలుగుదు నని నా మనవిగా మనవి చేయుడు. క్షమియించు మని బ్రతిమాలితి ననుడు" అన్నది.

వారు తొందరగా" ఆహా! అది వట్టిమాట. మహా

రా జెప్పుటకు లేనిది నేడు యుదయమువనే కొల్యుదీర్చి యిప్ప టివరకును నీ కొరకే వేచియున్నవాడు. నీతోటి పనికూడ యి ప్పుడే పరిసమాప్తి కావలయునట. తప్పదు" అని కచ్చిత ముగా చెప్పినాడు.

అంత నా బాల "ఆహా! అయిన ప్రమాదమే. ఇవత ల దేవిని తిరస్కరించరాదు. అట్లయిన వరమునకు నీరు వద లుకొనుట యన్నమాట. అవతల రాజాజ్ఞ నుల్లంఘించరా దు. అలాగయిన నిహమున కష్టములు తెచ్చి పెట్టుకొనుట. డబ్బు పెట్టి తద్దినము కొని తెచ్చుకొనుట వంటిది. అదికాక జననిందయును, విశ్వాసఘాతియును మీదపడును. పురోభివృ ద్ధికి భంగము. ఏది చేయుటకును తోచదు. నా కొకవేళ నాతో నెరవేరవలసిన పని యిప్పుడే నెరవేరవలయు ననిన నా రిక్కడకు దయచేసి......ఆహా! అంతమాట నా నోట వెలు వడనీయరాదు. క్షమియించుడు" అని నసికి యుపచారమును నరుదుకొనుట నటించినది.

రాజభటులు "అవును. అది ప్రపంచాతీతముగా ను న్నను కొంతవరకు సబబుగనే కనుపించుచున్నది. అయిన నా సంగతి రాజుగారితో మనవి చేసి......" అనునంతలో ముస లిది "ఆహా! దానికేమి! అందుపోయిన దేమి! మాయింట్ల కెందరు రారు! మహారాజులేమి. ముట్టిపిడతలేమి. ఆ వివక్షత లే దిక్కడ" అన్నది సగర్వముగా.

పిల్ల "అయ్యలారా! నా కొకవేళ నా యదృష్టవశ

మున, నా పూర్వపుణ్యభాగ్యమున నాయిల్లు పావనముచేయుట కై పిచ్చుకగుంట మీదకు భాగీరథి ప్రవహించునటుల మా యింటికివచ్చినను మే మా ప్రభువులకు కూర్చుండు సావకాశమే కలుగచేయలేముకదా! ఎట్లుసత్కరించగలము. అయినను....." అని సందేహించుచున్నంతలో రాజభటు లా మాటల కడ్డువచ్చి, "ఆహా! దానికేమి? నీవుమాత్రము సామాన్యురాలవా? ఉన్నంతవరకే యయిరి. ఆ విషయమున నీవు సందేహించ నక్కరలేదు. నే నీ సంగతి రాజుగారితో మనవిచేసి, యిట్టి యసమయ సమయమున నిన్ను పిలువపంచుట మంచిదికాదని చెప్పెదను. వీలుకలిగిన వారే వచ్చెద రొకసారి యిక్కడకు. ఎవరికోసము. అవసరమునుబట్టి." అని తమ స్థితిగతులు మరచి పలికి సగర్వముగా నడచిపోయి, రాజుసముఖమున ప్రవేశించినారు. రాజు వారలను చూచి సానిపడుచును— పడుచే కాదనుకొనుడు— కాని యంతవరకు.........వెంట తీసికొనిరాకనే వచ్చినందులకు వారిని తీవ్రముగా మందలించినాడు. వారు కంగారుపడి సంగ తాద్యంతము— దేవి ప్రత్యక్షమయినటులను, యామె యా సమయమున దేవితో మాటలాడుచుండుట తాము ప్రత్యక్షముగా విని

---

* పాఠక మహాశయులారా. సాని పిల్లచమత్కారమేమి, ఆమెసాక్షాత్కరించుటయెట్లో, చమత్కారము అని మా చేప్రత్యేకముగా ప్రచురింపబడిన పుస్తకమున చూడగోరుచున్నాము.

